ఓం

ఓం నమో విశ్వకర్మణే

ధర్మార్థ కామ మోక్ష ఫలప్రదంబగు

# శ్రీ విశ్వకర్మ వ్రతకల్పము

ఉప్పునూతుల గురుసాయి

ఆచార్యులు



సంగ్రహీత :

విమర్శకాచార్య, శిల్పకళాకోవిద

బ్రహ్మశ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్య కవి


ప్రకటనకర్త :

బ్రహ్మశ్రీ తుమపాల విజయశేఖరరావు

వీరరాఘవులు వీధి – షరాబు బజారు

తెనాలి - 522 201.

1992 ]

[ వెల : రు. 15-00

# శ్రీ విశ్వకర్మ పూజాపీఠ మండలమ్

ప్రాచీ




ప్రతీచీ

ఓం విశ్వకర్మాదిశామ్పతి స్సనః పశూన్పాతు సో౽స్మాన్పాతు తస్మైనమః ప్రజాపతీ రుద్రో వరుణో౽గ్నిర్దిశా మ్పతిస్సనః పశూన్పాతుసో౽స్మాన్పాతుతస్మైనమః ॥

శ్లో॥ దయాబ్ధేత్రాహిసంసార సంతప్తంశరణాగతం
భక్త్యాఽర్పయామ్యహంతుభ్యం చతుర్థావణార్చనమ్.

ఓం గౌర్యైనమః పద్మాయైనమః శచ్యైనమః మేధాయైనమః సావిత్ర్యై నమః విజయాయైనమః జయాయైనమః దేవసేనాయైనమః స్వధాయైనమః స్వాహాయైనమః మాతృభ్యోనమః లోకమాతృభ్యోనమః ధృత్యైనమః తుష్ట్యైనమః పుష్ట్యైనమః ఆత్మనః కుల దేవతాయై నమః

శ్లో॥ దయాబ్ధేత్రాహిసంసార సంతప్తంశరణాగతం
భక్త్యాఽర్పయామ్యహంతుభ్యం పంచమావరణార్చనమ్

—: అథాష్టోత్తరశతనామ పూజా :—

ఓం విశ్వకర్మణేనమః
విశ్వబ్రహ్మణే ,
విశ్వధారిణే ,
సహస్రశీర్షాయ ,
సహస్రాక్షాయ ,
సహస్రపాదాయ ,
అనంతాయ ,
సర్వస్వతంత్రాయ ,
ఆదిమూర్తయే ,
సర్వేశ్వరాయ ,
అనాదిరూపాయ ,
పంచభూతాధిపతయే ,
[illegible] ,

ఓం మహాతత్వాత్మనేనమః
జగద్వంద్యాయ ,
పంచాననాయ ,
పంచస్వరూపాయ ,
సర్వోత్కృష్టాయ ,
పరాత్పరాయ ,
విభవే ,
అమృతాధిపతయే ,
సృష్టిస్థితిసంహారకాయ ,
త్వష్ట్రే ,
సర్వాంతర్యామినే ,
అనంతరూపాయ ,
[illegible] ,



ఓం దివ్యవిగ్రహాయనమః
దేవదేవాయ ,
ఋషివందితాయ ,
వివిధదక్షాయ ,
సుప్రదీపాయ ,
చామీకరప్రభాయ ,
సర్వాధారాయ ,
సర్వసిద్ధిప్రసాదకాయ ,
పుణ్యశ్లోకాయ ,
శాశ్వతాయ ,
వేదవేద్యాయ ,
నిగమాగదితలక్షణాయ ,
జగద్గురవే ,
జ్ఞానరూపిణే ,
నిర్వికల్పాయ ,
జగదంతర్యామినే ,
నిరాధారాయ ,
నిర్ద్వంద్వాయ ,
నిరీశ్వరాయ ,
నిత్యానందాయ ,
బ్రహ్మాండభాండోదరాయ ,
నిరామయాయ ,
పరబ్రహ్మణే ,
పరమాత్మనే ,
విరాడ్రూపాయ ,
నిరాకారాయ 50

26 ఓం అఖండాయ నమః
సర్వసుఖప్రదాయ ,
అజాయ ,
భావగమ్యాయ ,
అవ్యయాయ ,
ప్రభాజనకాయ ,
జగద్రక్షాయ ,
సాకారాయ ,
భగవతే ,
సర్వనామధారిణే ,
యజ్ఞభర్త్రే ,
సూర్యచంద్రాగ్నిలోచనాయ ,
యజ్ఞకర్త్రే ,
మనోజవిత్వాయ ,
వేదపురుషాయ ,
సర్వకామఫలప్రదాయ ,
వేదాంతసంచారిణే ,
భక్తరక్షకాయ ,
దురితహరాయ ,
ముక్తిప్రదాయ ,
ధర్మార్థకామమోక్షప్రదాయ ,
భవ్యాయ ,
గతజనభంధవే ,
కామితార్థప్రదాయ ,
గ్రీష్మేద్యాయ 75
వసంతాఢ్యాయ ,

| | | | |
|---|---|---|---|
| ఓం శరద్ధవిక్రృతాయ నమః | | ఓం సర్వకారణకారణాయ నమః | |
| ఛందఃపరిధయే | , | హృత్పద్మవాసినే | , |
| యజ్ఞనాథాయ | , | హంసస్వరూపాయ | , |
| ఋషి ప్రవరాయ | . | యజ్ఞహోత్రే | , |
| వృషరాజ్యాయ | , | సహస్రకమలవాసినే | , |
| యజ్ఞరూపాయ | , | యజ్ఞభోక్త్రే | , |
| సర్వహితాయ | , | గురవే | , |
| యజ్ఞపురుషాయ | , | షట్చక్రసంచారిణే | ౦౦ |
| వేదకారణాయ | , | ఆత్మస్వరూపాయ | , |
| ప్రణవ వ్యూహాయ | , | శిష్టరక్షణాయ | , |
| జ్యోతిరూపాయ | , | అమూర్తయే | , |
| అనఘాయ | , | సర్వశాసనాయ | , |
| అచింత్యాయ | , | శాంతాయ | , |
| సర్వతోముఖాయ | , | నిత్యాయ | . |
| భక్తగోచరాయ | , | బ్రహ్మవిద్యాధిపాయ | , |
| దేవాధినాథాయ | , | సర్వమంగళాయ | , |

ఓం శ్రీవిరాడ్విశ్వకర్మణేనమః అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి (తతః అవసరనైవేద్యం కుర్యాత్) తతః శ్రీవిరాడ్విశ్వకర్మ సహస్రనామపూజాం కరిష్యే (ఇతిసంకల్ప్య)



## అథ శ్రీ విశ్వకర్మ కథా ప్రారంభః

శ్లో॥ జ్యోతిర్మయం శాంతిమయం ప్రదీప్తకం విశ్వాత్మకం విశ్వపతిం నిరీహం
అద్యంత శూన్యం సకలైకనాథం శ్రీవిశ్వకర్మాణమహం నమామి ॥ ౧

శ్లో॥ వినాయకం గిరాందేవీం ధ్యాయేఽహం మూర్తి పంచకం
నివారణాయ విఘ్నానాం దిశాధీశాన్ సవగ్రహాన్ ॥ ౨

శ్లో॥ ఏకదామనయోఽనేకాః ధర్మక్షేత్రే కురూత్తరే
సమేత్య పరిపప్రచ్ఛుః సూతంధర్మ విదాంపరమ్ ॥ 3

తా॥ పూర్వ మొకప్పు డుత్తర కురుదేశములోని ధర్మక్షేత్రమున మహర్షులందఱునుగూడి ధర్మవేత్తలలో నధికుఁడగు సూత మహర్షిం గాంచి యట్లు ప్రశ్నించిరి.

శ్లో॥ దక్షిణేనసరస్వత్యాః దృషద్వత్యుత్తరేణచ
యేవసంతి కురుక్షేత్రే తేవసంతి త్రివిష్టపే ॥ (మహాభారతము)

ఢిల్లీకి వాయవ్యమున సరస్వతీ దృషద్వతీ నదుల మధ్యగల ప్రదేశమును గురుక్షేత్రమని పూర్వము వ్యవహరించుచుండెడివారు పురాణములలోను గురుక్షేత్రములో ధర్మక్షేత్రము కలదని చెప్పబడి యుండెను. అచట గురుక్షేత్రమను సరోవరము గలదు.

ఋషయః ఊచుః

శ్లో॥ పురాణజ్ఞ మహాభాగ విధాయానుగ్రహం పరం
అస్మాకం సహసోత్పన్నం సంశయం ఛిందిసత్వరమ్ ॥ ౪

తా॥ ఋషు లడుగుచున్నారు. సమస్త పురాణముల నెఱింగిన యో మహాత్మా! మాకిప్పుడొక సంశయము కల్గినది. మాయందు సంపూర్ణానుగ్రహముంచి వైశంద్యని రింపుము.

శ్లో॥ శ్రుతాని బహురూపాణి విరాడ్రూపస్య తేజసః
తేషాం మధ్యేపరంశ్రేయః కింరూపం తన్నిబోధయ ॥ ౫

Scanned by CamScanner

తా॥ నిరుపమాన తేజస్వియగు శ్రీమత్పరమేశ్వరుని యొక్క యవతారములు బహువిధములుగా వర్ణింపబడుచున్నవి. వానిలో మిగుల శ్రేష్ఠమయిన యవతారమేదో దానిని తెలియఁజేయుము.

శ్లో॥ మునయోభోమహాత్మానః ప్రశ్నోఽయంసుమహత్తరః
లోకానాం హితముద్దిశ్య కృతః సర్వశుభంకరః ॥ ౬

తా॥ సూతుఁడు చెప్పుచున్నాడు. ఉదార మనస్కులగు ఓ మునులారా! ఈ ప్రశ్న మిగుల గొప్పది. అఖిల జగత్కల్యాణము నుద్దేశించి మంగళకరముగఁ జేయబడినది.

శ్లో॥ సప్రమోఽహం కథయిష్యామి రూపం సుమహాద్భుతం
లోక పూజ్యస్య దేవస్య సమస్త జగతాంపతేః ॥

తా॥ సర్వజగత్పాలకుండును పరమ పూజ్యుఁడును అగు భగవానుని యొక్క యత్యద్భుత రూపమునకు నమస్కరించి వర్ణించి చెప్పెదను.

శ్లో॥ అనంతానిహిరూపాణి తస్యేశస్యతపోధనాః
తేషాంధ్యేమహాశ్రేష్ఠం రూపం శ్రుణుతసాదరమ్ ॥ ౮

తా॥ ఓ తాపసులారా! ఆ పరమాత్మయొక్క రూపము అనంతములు వానిలో సర్వశ్రేష్ఠమయిన రూపమొకటి కలదు తద్వర్ణమును సావధానచిత్తముతో నాకర్ణింపుడు.

శ్లో॥ తస్యస్మరణ మాత్రేణ మహాపాతకినోజనాః
తేఽపిపాపవినిర్ముక్తా భవేయుర్నాత్రసంశయః ॥ ౯

తా॥ ఆదివ్యస్వరూపముయొక్క కేవలస్మరణ మాత్రమున మహాపాతకులు సయితము పాపమునుండి విముక్తు లగుచున్నారు. ఇందు సంశయములేదు.

శ్లో॥ ఇదమేవానుయోగంహి లోకానాం విహితేచ్ఛయా
ఏకదా క్షీరజలధి పప్రచ్ఛ కమలాహరిం ॥ ౧౦

తా॥ ఈ ప్రశ్నమునే యొకప్పుడు క్షీరసాగర మధ్యమున లోక కళ్యాణోత్సవమున భగవానుఁడగు విష్ణువుగూర్చి ప్రశ్నించెను.



లక్ష్మి ఉవాచ.

శ్లో॥ జనానైకానిరూపాణి లోకనాథస్యతస్యహి
అర్చంతిపరయాభక్త్యా భక్తాభక్తయుతాభువి॥ ౧౧

తా॥ లక్ష్మి యడుగుచున్నది. మహానుభావుఁడగు జగన్నాయకుని యొక్క రూపము లనేకమైయున్నవికదా! పృథివియందలి మానవు లేరూపమును బరమ భక్తితో పూజించుచున్నారు.

శ్లో॥ తుల్యానితానిరూపాణి కిముసర్వాణివల్లభ
ఆహోస్విత్ విద్యతేకించిత్ ముఖ్యాముఖ్యవిభేదతః ౧౨

తా॥ ఓ ప్రియపతీ! నీకు సమస్త రూపములయందలి గుణదోషములు తెలియును. అందేవి ప్రధానములు ఏవి యప్రధానములు వాని యొక్క గతిభేదములను దెలిపి యీ సందేహము నన్ను బ్రోవఁగోరెదము.

విష్ణురువాచ.

శ్లో॥ భగవాన్ సర్వబ్రహ్మాండం సంహృత్యాత్మని వల్లభే
స్వానుభూత్యైకరూపేణ స్థితివాఽ యోగమాయయా॥

తా॥ విష్ణువు చెప్పుచున్నాఁడు ఓ ప్రియురాలా! ఆ పరమేశ్వరుడు అఖిల బ్రహ్మాండమును దనయందు లీనముచేసుకొని యోగమాయచేత స్వానుభవముతో నుండును

శ్లో॥ అసంఖ్యాన్ బ్రహ్మలోకాదీన్ సృజతే సకిలేనవై
యేనరూపేణతద్దేవి వచ్మిశ్రుణు ప్రయత్నతః ॥ ౧౪

తా॥ అట్టి సమయమున మితిలేని బ్రహ్మదిలోకములను, ఏ రూపముతో సృష్టించుచున్నాఁడో యా రూపమును విశదముగఁ జెప్పుచున్నాను. ఐక్యముతో వినుము.

శ్లో॥ మహాద్భుతావతారంవై ధృత్వాసో విశ్వకర్మణః
వరిత సేజసావ్యాప్తం నైకార్కద్యుత సన్నిభమ్ ॥ ౧౫

శ్లో॥ తతస్సోజీవసృష్టించ స్రష్టుకామః ప్రియంవదే!
బ్రహ్మాణండచయత్యాశు పుణ్యాత్మానంతపస్వినమ్ ॥ ౧౬

తా॥ ఓ దేవీ ! మహాద్భుతము తేజోవ్యాప్తమును బహు సూర్యుల కంటె నధిక ప్రకాశమును అగు విరాడ్విశ్వకర్మ స్వరూపమును ధరించుచున్నాడు. తరువాత మనుష్యాదులం సృజింపదలంచి పుణ్యులలో ప్రథముండగు తపస్విని బ్రహ్మనుగాం బుట్టించుచున్నాడు.

శ్లో॥ తస్మై వేదం మహాదీప్తం ప్రాహిణోత్సర్వతో ముఖం
ఋగ్యజుస్సామసంజ్ఞంచ స్తుత్యధ్వరగసమ్మితమ్ ॥ ౧౭

తా॥ ఆ మహాతేజస్వియగు బ్రహ్మదేవునికి స్తుతియజ్ఞగాయన ప్రతిపాదనమగు ఋగ్యజుస్సామ వేదములను సత్తమ విధాన ముపదేశించెను.

శ్లో॥ శిల్పవిద్యయుతాన్మంత్రా నథర్వాఖ్యానథో మహాన్
తేనైవశిల్పినః సర్వం వస్తుజాతం ప్రకుర్వతే ॥ ౧౮

తా॥ అదే ప్రకారముగా శిల్పవిద్యా ప్రతిపాదకమగు నథర్వణ వేదమును తదుపవేదమగు శిల్పవేదమును జెప్పెను. వానిని జదివిన శిల్పజ్ఞులగు ఋషులు శిల్పశాస్త్రముల రచించి యనేక వస్తువుల నిర్మించిరి. (శ్లో॥ విశ్వకర్మాఽభవత్పూర్వం సృష్ట్యాదావి దశ్రుతాః రచిత్వాఽఖిలదేవాదీన్ బ్రహ్మవిష్ణుమహేశ్వరాన్ (మూలస్తంభము) "స్థాపత్యవేదో విశ్వకర్మాది శిల్పశాస్త్రం అథర్వస్యోపవేదః" (చరణవ్యూహం) శివకృష్ణుల స్తుతించుట "వశంతంతుమయం శిక్యం శిక్యే బ్రహ్మాండ మప్పృశం విహితం ఉభయాంతేన విశ్వకర్మాసపాతునః (పద్మపురాణం)

శ్లో॥ అన్యేషుతత్ స్వరూపేషు ఇదంముఖ్యంమహేశ్వరి
ఏనేన సకలాసృష్టి రుత్పద్యేత క్షణేన వై॥ ౧౯

తా॥ ఓ దేవీ ! ఆ యొక్క రూపములలో నీ విశ్వకర్మస్వరూపము ముఖ్యమైనది. అట్టి విశ్వకర్మ స్వరూపము చేతనే యొక క్షణకాలములో జగత్సృష్టి యంతయు నగుచున్నది.

సూత ఉవాచ

శ్లో॥ ఆస్యేదమద్భుతం రూపం యోజనో ధ్యాయే తేక్షణం
తస్యవిఘ్నాః నవశ్యంతి విచికిత్సాత్ర కాపి న ॥ ౨౦



తా॥ సూతుఁడు చెప్పుచున్నాడు అట్టి విశ్వకర్మ పరమాత్మ స్వరూపమును క్షణకాల మేకాగ్రచిత్తముతో నెవ్వఁడు ధ్యానము చేయుచున్నాఁడో యతనికి సర్వ సంకటములు దూరముగాఁ దొలగిపోవును. ఇందు సందేహములేదు.

శ్లో॥ యశ్శిల్పి ప్రోజ్జ్వలంరూపం దివ్యం శ్రీవిశ్వకర్మణః
విచింతయతిధ్యానేన తస్యదుఃఖం విశీర్యతే॥ ౨౧

తా॥ తేజోవంతమైన శ్రీవిశ్వకర్మయొక్క దివ్యస్వరూపమును శిల్పి ధ్యానయుక్తముగాఁ దలంచుచున్నాఁడో అతనికి దుఃఖమంతయు నశించి పవిత్రుఁడగుచున్నాడు.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం ప్రథమోధ్యాయః

## అథ ద్వితీయోఽధ్యాయః

సూత ఉవాచ

శ్లో॥ ఇత్థం శ్రీవిశ్వస్య రూపం శ్రియైరాఖ్యాయశోభనం
త్రిలోకాధిపతిర్విష్ణు స్తదాతూష్ణీంబభూవహ॥ ౧

తా॥ సూతుఁడు చెప్పుచున్నాడు ఓ ఋషులారా ! ఈ ప్రకారముగ లక్ష్మీదేవికి విరాడ్విశ్వకర్మ దివ్యస్వరూపమును వర్ణించి చెప్పి జగన్నాథుఁడగు విష్ణువు నిశ్చలచిత్తుఁడై యుండెను.

ఋషయ ఊచుః

శ్లో॥ మహాత్మన్ సర్వధర్మజ్ఞ బ్రూహి నో వదతాంవర
ఇత్థం జ్ఞానం త్వయా బ్రహ్మన్ రహస్య మిద మద్భుతమ్॥

తా॥ ఋషులందఱు మరల నిట్లనిరి. సమస్త ధర్మముల నెఱింగినవాడవు వక్తలలో శ్రేష్ఠుఁడవు. అగు నో మహాత్మా ! ఆ దివ్యరూపమును గూర్చిన లక్ష్మీ విష్ణు సంవాదమును మీ రెటుల దెలిపికొనినారో యది మాకు మిగుల నచ్చెరు వగుచున్నది దానిని మా కుపదేశింప గోరుచున్నాము.

శ్లో॥ కథం పూజ్య మిదంరూపం కథం సర్వత్ర ప్రావరత్
విదాం చకార సంసారః కథంకారం మహత్తరమ్॥ 3

తా॥ ఆ దివ్యరూపము పూజింపఁదగినది. లోకమున నది యెట్లు వ్యాపించినది ? ఈ సర్వోత్తమ మగు విశ్వకర్మ స్వరూపమును లోకమున నెట్లు పూజింపవలెను ?

సూత ఉవాచ

శ్లో॥ శ్రూయతాం మునిభి స్సార్ధ్వైర్యథా మే కర్ణ గోచరః
అభూ దేషసమాచారః లోకానాం సర్వకామదః॥ ౪

తా॥ సూతుడు పల్కుచున్నాడు. ఓ ఋషులారా! మనుష్యులకు సమస్తమగు కోరికలను సమృద్ధిగా నిచ్చునట్టి యీ వ్రతమును సమగ్రముగాఁ జెప్పుచున్నాను వినుఁడు.

శ్లో॥ మహర్షి రంగిరోనామ తపస్తేపే సుదుష్కరం
గంగాతీరం సమాసాద్య పార్వతీపితు రంతికే॥ ౫

తా॥ పూర్వ మంగిరుఁడను పేరుగల యొక మహర్షికలఁడు అతడు హిమాలయపర్వత సమీపమువగల గంగానదీతీరమున కొంతకాలము భయంకరమయిన తపస్సును జేసెను. ఆ తపశ్చర్యను జెప్పుచున్నాను

శ్లో॥ వృష్టౌ వనావృతే దేశే శీతే వారిణి శీతలే
చండాతపే నిదాఘే తుస్థితశ్చక్రే మహాతపః॥ ౬

తా॥ ఆ తపశ్చర్య చాలా కఠినమైనది. వర్షాకాలమందును, హేమంతరుతువునందును, జలములోనుండియును, గ్రీష్మర్తువులో నధికమగు నెండలో నుండియును తపమొనరించెను.

శ్లో॥ పరంచేతస్తదా తస్య నరేభే శర్మ కర్హిచిత్
ఇతస్తతో ధావతిస్మ స్వతృష్ణాయాం మృగో యథా॥ ౭

తా॥ ఆ విధముగా కఠిన తపమొనర్చినపుడా మహర్షికి మనశ్శాంతి యేమియు లేదయ్యెను. దప్పిగొనిన జింక యెండమావులను జూచి జలమని భ్రమించి యిటునటు



పరుగెత్తి నీరు గానక పరితపించినట్లు చంచలమనస్కుడై వివిధరూపములను గూర్చి తపం బొనర్చి ఫలము ననుభవింపలేక పరితపించుచుండెను.

శ్లో॥ అకస్మాదుదభూ దేషా దివ్యావాణ్య శరీరిణీ
వృథా శ్రమం విధత్సే త్వం లక్ష్యభ్రష్టస్తపోధన॥ ౮

తా॥ ఆ సమయమున నాకస్మికముగా (పాలకడలినుండి దైవికముగా శ్రీలక్ష్మీదేవి) ఆకాశవాణి యిట్లు పలికెను. ఓ తపోధనా! నీ తపశ్చర్య వ్యర్థమగుచున్నది కారణమేమనిన నీ చిత్తము స్థిరముగా నుండలేదు.

శ్లో॥ లక్ష్యభ్రష్టః కథం బాణః స్వలక్ష్యం భేత్తు మర్హతి
తథైవ తే గతి ర్జ్ఞాతా గతో లోకే చ హాస్య తామ్॥

తా॥ బాణమును గురిచూచి ప్రయోగించినట్లయిన వధ శక్యమగును అటుల లక్ష్యము నిలుపనిచో బాణము వ్యర్థమగును అటులే నీ తపశ్చర్యగతి వివిధ రూప దర్శనములచే వ్యర్థమై లోకమున నపహాస్యపాత్రుఁడవగుచున్నావు.

శ్లో॥ ఉత్పత్తి స్థితి సంహార కర్తా లోకేషు విశ్రుతః
విశ్వకర్మా మహాతేజా లోకాభీష్టవరప్రదః ౧౦

తా॥ జగదుత్పత్తి పాలన సంహారకర్తయును మహాతేజస్వియగు భగవాన్ విశ్వకర్మయే సమస్తవాంఛితముల సిద్ధింపఁజేయునని లోకమునఁ బ్రసిద్ధికలదు.

శ్లో॥ తస్యరూపం మహాదివ్యం పంచాస్యం దశబాహుకమ్.
సరస్వత్యాః శ్రియాః పూజ్య పాదం ధ్యాయ దివానిశమ్॥

తా॥ భగవానుఁడగు నా విశ్వకర్మయొక్క రూపము పంచముఖములను, దశబాహువులను, గలిగియున్నది. ఆ మహాదేవుఁడు సగుణస్వరూపముతో సరస్వతీ లక్ష్మీదేవతలచే బూజింపఁబడుచున్న పాదములు గలవాఁడై యున్నాడు అట్టి రూపము నహర్నిశమును చిత్తముతో ధ్యాన మొనర్పుము.

శ్లో॥ ఇదంరూపం పయోబ్ధౌమాం హరి స్వయ మసూసుచత్
అద్యాపి రోమహర్షో మే తస్య ధ్యానేన జాయతే॥ ౧౨

తా॥ క్షీరసాగరమధ్యమున స్వయముగా విష్ణుని దివ్యస్వరూపమును నా కుప దేశించెను. ఆ దివ్యరూప ధ్యానమొనర్చుటకు నా కిప్పటికిని గగుర్పాటు కలుగుచున్నది. "రుద్రాక్షమాల్యాంబరధరో గిరీశోగిరిశప్రియః శిల్పీశః శిల్పినాంశ్రేష్ఠః సర్వశిల్ప ప్రవర్తకః (వాయుపురాణము) శివవిష్ణువుల కభేదము కనుక యిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ అమాయాం సర్వకర్మాణి హిత్వా వ్రత ముపాచర
తస్మి న్నహని తస్యైవ పూజాం కురు విధానతః॥ ౧౩

తా॥ అమావాస్యయందు సర్వకర్మములు నివర్తించుకొని వ్రతము నాచరించుము. మఱియు నా దినమున విధిపూర్వకముగా విశ్వకర్మ పూజచేయుము.

శ్లో॥ గరీయసీం నభోనాద మిమాం శ్రుత్వాఽంగిరా గిరం
విస్మయం పరమం ప్రాప్య ధ్యానయుక్తోఽభవ న్మునిః

తా॥ ఈ విధముగా లక్ష్మి యాకాశమునుండి పలికినమాటలను విని మహర్షి యాంగిరుఁ డాశ్చర్యమొంది యప్పుడే విశ్వకర్మ ధ్యానమును జేసిన వాఁడాయెను.

శ్లో॥ ధ్యాయతే విశ్వకర్మాణం తస్య చేతసి ప్రావిశత్
శిల్పజ్ఞానమయో వేదోఽ థర్వాఖ్యః సార్థక స్వయమ్॥

తా॥ ఏకాగ్రచిత్తముతో నావిశ్వకర్మను సఖుఁడధ్యానము చేసెను ఆతఁడా విశ్వకర్మకృపవలన శిల్పజ్ఞానము కలవాఁడయ్యెను. అధర్వణవేద మర్థసహితముగ దనహృదయమునఁ బ్రవేశించెను.

శ్లో॥ స ఆవిర్భావయాం చక్రే తత్త్వతో మునిరాట్పరః
విమానగాః శిల్పవిద్యాస్తతో జ్ఞానప్రవాహవాన్॥ ౧౬

తా॥ తరువాత తత్వజ్ఞానియును, మునిశ్రేష్ఠుఁడును, అగు నాంగిరుండు తన జ్ఞానసంపత్తిచే విమానవిద్య యంత్రవిద్య మన్నగు ననేక విధములయిన యాశ్చర్య కరమగు శిల్పవిద్యలను ప్రకటించెను. అంగిరుని వంశమున బారంపర్యముగ బృహస్పతి, సుధన్వుఁడు, ఋభువులు మొదలగు మహర్షులు, శిల్పశాస్త్రవేత్తలలో ముఖ్యులుగా జనించిరి.



శ్లో॥ సుఖయుక్తం జగ దిదం విశ్వకర్మాను కంపయా
అనశ్యకీయం యంత్రాది వస్తుజాతం కరోతిచ॥ ౧౭

తా॥ భగవంతుఁడగు విశ్వకర్మయొక్క దయవలన నీ యఖిలజనులు సుఖము ననుభవించుచున్నారు. కారణమేమనగా దనయొక్క శిల్పవిజ్ఞానము వలన లోకమున కత్యంతోపయుక్తమగు విమానాద్యనే కాశ్చర్యకర వస్తు జాతము నిర్మాణమగుచున్నది

శ్లో॥ ఏవం లోకే మహారూపం తతో విశ్రుతి మాగమత్
పరంపరా క్రమాయాతం పూతే మే శ్రవణో వ్యధాత్॥

తా॥ అంగిరుఁ డప్పుడు దర్శించిన యా శ్రీవిరాడ్విశ్వకర్మ దివ్యరూపము జగత్ప్రసిద్ధి నొందెను ఆ ప్రకారముగా బారంపర్యమైన యా కథలను వర్ణించి నేనును బవిత్రుఁడనైతిని.

శ్లో॥ ఇదం రహస్యం పరమం ఋషయః శ్రుణ్వంతి యే నరాః
తేభ్యః శ్రవణమాత్రేణ జ్ఞానలబ్ధి ర్భవిష్యతి॥ ౧౯

తా॥ ఓ ఋషులారా। ఎవ్వరీ యత్యంతరహస్యమైన కథను వినుచున్నారో వారికి వినినంతనే జ్ఞానము కలుగుచున్నది.

శ్లో॥ ఇదంరూపం మహాజ్యోతిః సంసార స్యోపతారకం
కృతఘ్నః శిల్పపీ సస్యాత్ యో నధ్యాయతిమానవః॥

తా॥ మానవులను భవసాగరమునుండి తరింపఁ జేయునదియు, మహాతేజోవంతమైనదియు, నగు నీ విశ్వకర్మ దివ్యస్వరూపము నే మానవుఁడు ధ్యానింపఁడో యట్టి వాఁడు పాపియును, కృతఘ్నుఁడును అగును.

ఋషు ఉవాచః

శ్లో॥ విశ్వకర్మా కథం సూత వాసుదేవేన పూజితః
కథం వా శంకరేణైవ విస్తరేణ ప్రకీర్తయ॥ ౨౧

తా॥ ఓ సూతమహర్షీ। శ్రీకృష్ణుడును శంకరుఁడును శ్రీవిరాడ్విశ్వకర్మను పూజించిన విధానము మాకు సవిస్తరముగా దెలుప గోరుచున్నాము.

సూతోవాచ

శ్లో॥ శ్రుణుధ్వ మృషయ స్సర్వే పూజనం విశ్వకర్మణః
వాసుదేవమహేశాభ్యాం యత్కృతన్మయోచ్యతే॥

తా॥ సూతుడు చెప్పుచున్నాడు ఋషులారా! కృష్ణుడును శంకరుడును విరాడ్విశ్వకర్మను పూజించిన ప్రకారము చెప్పుచున్నాను ఆ విధమును సాంగముగ నాకర్ణింపుడు

శ్లో॥ మాఘే శుక్లత్రయోదశ్యాం పూర్ణిమాయాంచ శ్రావణే
ఏకాదశ్యాం పూర్ణిమాయాం కార్తికే సితపక్షకే॥ ౨౩

శ్లో॥ పౌర్ణిమాస్యాం చపంచమ్యాం న్యాచైత్రేశుక్ల పక్షకే
అధిక శ్రావణే మాసి చామాయాం మార్గశీర్షకే॥ ౨౪

శ్లో॥ సితపక్షే దశమ్యాం చ అమాయాం మాసి మాసి చ
శుభకార్యేషు సర్వేషు వ్రతం కుర్యా ద్యథావిధిః॥ ౨౫

తా॥ మాఘశుద్ధత్రయోదశి, శ్రావణ శుద్ధపూర్ణిమ, కార్తిక శుద్ధయేకాదశి, పూర్ణిమ, చైత్రశుద్ధపంచమి, పూర్ణిమ, అధిక శ్రావణ బహుళయమావాస్య, మార్గశిర శుద్ధదశమీ, మున్నగు తిథులయందును ప్రతిమాసమున నమావాస్య యందును, సమస్త శుభకార్యములయందును, యథావిధిగా వ్రతమాచరింపదగినది.

శ్లో॥ సర్వవర్ణై ర్వ్రతం కార్యం స్త్రీభి ర్వాపి మునీశ్వరాః
బ్రాహ్మణై ర్బాంధవై శ్చైవ వేదఘోషాసమన్వితః॥

శ్లో॥ నృత్యగీతాదిసంయుక్తో నానావాద్యాదిభి స్స్వనైః
యజమానః సపత్నికో మంగళస్నాన మాచరేత్॥ ౨౬

శ్లో॥ నిత్యకర్మ విధాయదా వేనం సంకల్పయే తత్తః
విశ్వకర్మన్ దేవదేవ వ్రతం తే సర్వకామదం॥ ౨౭

శ్లో॥ త్వత్ప్రియార్థం కరిష్యామి ప్రసీద త్రిజగత్ప్రభో
పూజాగృహం సమాసాద్య నానాలం కారశోభితమ్॥ ౨౮



శ్లో॥ పూజాస్థాన విశుద్ధర్థ్యం గోమయేన విలేపయేత్
తతః పంచవిధై శ్చూర్ణైః రంగవల్లీం ప్రకల్పయేత్॥

శ్లో॥ తస్యోపరిన్యసే ద్వస్త్రం మాతనం తండులై స్సహ
తస్యోపరిన్యసే ద్దేవం విశ్వకర్మాణ మీశ్వరమ్॥

తా॥ ఈ వ్రతము సర్వవర్ణములవా రాచరింపదగినది. స్త్రీలు కూడ నాచరింపవచ్చును యజమానుడు బంధువులతోను, బ్రాహ్మణులతోను, వేదమంత్రములతోను వివిధ మంగళ వాద్యములతోను, నృత్యగీతాదులతోను, పత్నియుతముగ మంగళ స్నానము చేయవలెను యథావిధి నిత్యకర్మలను నిర్వర్తించుకొని యో విశ్వకర్మప్రభూ! నీ వ్రతము నే నాచరించెదను. అని సంకల్పము చేసికొని నవ విధాలంకారమయిన పూజాగృహమునకుఁ బోయి యా ప్రదేశమును గోమయముతో నలికించి యైదురంగుల ముగ్గులను వేయించి యందుపై నూతన వస్త్రమును బఱచి యందు యథాశక్తి బియ్యమునుంచి యాపై శాస్త్రోక్తముగ దేవుని బ్రతిష్ఠింపవలయును.

శ్లో॥ గణనాథం ప్రపూజ్యాథ కలశం పూజయేత్తతః
పీఠం ప్రపూజయే త్పశ్చాత్కలశం పంచపల్లవైః॥

శ్లో॥ పంచరత్నై స్సమాయుక్తం వరుణం పూజయేత్వథ
మన్వాదీన్ బ్రహ్మణ ధ్యాత్వా కలశే పూజయేత్తతః॥

శ్లో॥ సర్వకామప్రదాతారం విశ్వకర్మాణ మీశ్వరం
మనుంతు మన్యుసూక్తేం యస్తే మన్యురితి క్రమాత్॥

శ్లో॥ మయోభూర్వాది ఇత్యేష మంత్రస్తు మయపూజనం
త్వష్టాదుహిత్ర ఇత్యేత త్త్వష్టార మర్చయే త్పుమాన్॥

శ్లో॥ వాస్తోష్పతేతి మంత్రేణ పూజయే చ్ఛిల్పికోత్తమం
తక్షన్ రథ మిదం చేతి దైవజ్ఞం తు ప్రపూజయేత్॥ ౩౫

తా॥ ముందుగా గణపతిని బూజించి తర్వాత గలశమును బూజింపవలెను. పిమ్మట పీఠమును బూజింపవలెను. అనంతరమున గలశమును బంచ పల్లవముల

తోను, పంచరత్నములతోను, జలయుక్తముగానుంచి వరుణుని బూజింపవలయును. తదుపరి "యస్తేమన్యు" అను సూక్తముతో మను బ్రహ్మను "మయోధూర్వాతో" అను మంత్రముతో మయ బ్రహ్మను "త్వష్టాదుహితే" అను మంత్రముతో త్వష్ట బ్రహ్మను "వాస్తోష్పతే" అను మంత్రముతో శిల్పి బ్రహ్మను "తక్షన్ రథం" అను మంత్రముతో దైవజ్ఞ బ్రహ్మను బూజించవలయును

శ్లో॥ సర్వవేదేషు యత్సూక్తం పఠ్యతే విశ్వకర్మణః
చతుర్దశావృత్తైనైవ యఇ మేత్యాదినా యజేత్॥ ౩౭

తా॥ సమస్త వేదములయందు జెప్పబడిన "య ఇ మా" ఇత్యాది పదునాలుగు ఋక్కులను పఠింపవలయును. మఱియు బురుష సూక్తము చేత బూజించవలయును.

శ్లో॥ అష్టాక్షరేణ మంత్రేణ పూజయే చ్చైవ నాదరం
సాంగం సావరణం దేవం శిల్పానా మీశ్వరం ప్రభుం॥

తా॥ మఱియు "ఓం విశ్వకర్మణేనమః" అను అష్టాక్షరీ మహామంత్రము చేత శ్రీ విశ్వకర్మయొక్క యవయవములను, అంగదేవతలగు మన్వాది పంచ బ్రహ్మలను, దేవపంచకమును, ఆవరణములను, ఆవరణదేవతలను, అష్టసిద్ధులను నవనిధులను, షోడశమాతృకలను, ఇత్యాదికముగాను భక్తియుక్తముగా పూజించవలెను.

శ్లో॥ సువర్ణ ప్రతిమా పూజ్యా హ్యు పచారైర్ద్విరష్టభిః
నైవేద్యం భక్తితోదద్యాత్ యథాశక్త్యాప్రయత్నతః ॥

శ్లో॥ శుద్ధాన్నోదకగోదుగ్ధం ఘటితం ఘృతశర్కరా
శుద్ధగోధూమచూర్ణంతు ఏకీ కృత్య నివేదయేత్ ॥ ౪౦

తా॥ శ్రీ విశ్వకర్మయొక్క సువర్ణప్రతిమ నైనను, శిలామూర్తి నైనను. నిర్మించి షోడశోపచారములఁ బూజింప వలయును. తరువాత నైవేద్యమును భక్తితో నర్పించవలయును। ఆ నైవేద్యమును వారివారి శక్తికొలది శుద్ధాన్నమును గోక్షీరము దధి, ఆజ్యము, చక్కెర, గోధుమరవ్వ ఇవి యన్నియును గలపి నివేదించవలయును.



శ్లో॥ బ్రాహ్మణై ర్బంధువర్గైశ్చ భక్తభావ సమన్వితః
కథాం శ్రుత్వా జనై స్సార్ధందద్యాద్విప్రాయ దక్షిణామ్ ॥

శ్లో॥ సర్వేభ్యస్తం ప్రసాదం చ దత్వా స్వయమపి గ్రసేత్
తతశ్చ స్వజనై స్సాకం బ్రాహ్మణాన్ ప్రతిభోజయేత్ ॥

తా॥ పిమ్మట మిగుల భక్తితో బ్రాహ్మణులు, బంధువులు, స్నేహితులు, మన్నగు వారితో సహ కథాశ్రవణమును జేయవలయును. అనంతరమున బ్రాహ్మణులకు దక్షిణ నొసంగవలయును. సమస్తమైన వారికి బ్రసాదమునిచ్చి తానును దీసికొనవలయును. తదుపరి బంధుమిత్రాది వర్గమునకును, బ్రాహ్మణులకును భోజనము నిడవలయును.

శ్లో॥ ఏవం శ్రీమద్విశ్వకర్మ పూజాం సమ్య గ్విధానతః
కృత్వాసద్యః సుఖం భుక్త్వా పరత్రే మోక్ష మాప్నుయాత్॥ ౪౩

తా॥ ఈ విధముగా నమావాస్యయందును, శుభకార్యములయందును, గృహప్రవేశమునందును, అవతార దినములందును, మిక్కిలి సంతోషముగా శ్రీవిశ్వకర్మ పూజ యథావిధి సంపూర్ణముగా జేసిన మనుష్యుఁ డప్పుడే సకల దుఃఖములనుండి విముక్తుడై యిహలోక సౌఖ్యముల నన్నిఁటి ననుభవించు చున్నాఁడు, అనంతరమున నతఁడు మోక్షప్రాప్తుం డగుచున్నాడు.

ఇతి శ్రీ విశ్వకర్మ సంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం ద్వితీయోఽధ్యాయః ॥

# అథతృతీయోఽధ్యాయః

శ్లో॥ అథాన్యం నంప్రవక్ష్యామి విశ్వకర్మ మహాప్రభో
మాహాత్మ్యం సర్వపాపఘ్నం వక్తౄణాం శ్రుణ్వతామపి ॥ ౧

ఓ మునులారా ! కథను జెప్పువారికిని విను వారికిని సమస్త పాపములను పోగొట్టునట్టి శ్రీ విశ్వకర్మ మాహాత్మ్యమగు నొక కథను జెప్పుచున్నాను.

శ్లో॥ కదాచి ద్దనుజాధీశౌ మధుకైటభనామకౌ
విష్ణునా సహసంగ్రామం చక్రతు ర్బలసంయుతౌ ॥ ౨

తా॥ ఒకానొకప్పుడు మధుకైటభులను దానవులు విష్ణువుతో యుద్ధ మొనరించిరి.

శ్లో॥ జిత్వా యుధి హరిర్జన్యే దానవౌ మధుకైటభౌ
శ్రమాపనయనార్థం తద్ధనురాశ్రిత్య సుప్తవాన్ ॥ ౩

తా॥ అప్పుడు విష్ణువు మధుకైటభులను దునుమాడి యలస ఎక్కుబెట్టిన తన యొక్క ధనుస్సును అను ాని శిరము దానిపై నుంచి నిద్రించెను.

శ్లో॥ తస్మిన్ క్షణె సుర్గా స్సర్వే లయంభీతా భవే దితి
కింకర్తవ్య మితి జ్ఞాత్వా బ్రహ్మాణం ప్రతి సమూచుః ॥ ౪

తా॥ ఆ సమయమున దేవతలందురు ప్రళయము సంభవించునను భయముతో బ్రహ్మదేవుని యొద్దకుఁబోయి యిట్లు పలికిరి.

శ్లో॥ క్రిమిమథ్య కురు స్వామిన్ గుణత్రుటి నశక్తికం
తతో బ్రహ్మ క్రిమిం సృష్ట్వా చాదిదేశ సురైస్సహ ॥ ౫

తా॥ స్వామీ ! శ్రీవిష్ణువు నిద్రవహించుచున్నాఁడు. కనుక ఆయనను జాగ్రత్తకు దెచ్చుటకై చదపురుగును నిర్మించవలయును. వింటినారి తెగిన వెంటనే మెలకువ కలుగును. అమాట వినిన తోడనే బ్రహ్మపురుగును నిర్మించి వింటినారిని తెగ గొఱుక నాజ్ఞనిచ్చెను.



శ్లో॥ కిమిదం పాపకార్యం హి కథం తాత కరోమ్యహం
తం శ్రుత్వా దేవతాః ప్రాహుస్తే దాన్యామో హవి స్సదా ॥

తా॥ ఆ చదపురుగు బ్రహ్మతో స్వామీ ! శ్రీ విష్ణువు నిద్రించుచుండ విఘ్న మొనర్చునట్టి పాపకార్యమునకు నన్నేల ప్రేరేపించుచుంటివి. ఇట్టి పని నేనేల చేయ గల్గుదును. అనుచుండ దేవతలు నీకు హవిర్భాగము నొసంగుదు మనిరి.

శ్లో॥ ఏతస్మిన్నంతరే గత్వా తచ్ఛిద్యా చ్ఛింజినీం క్రిమిః
భీకరధ్వనినా నాకం శార్ఙ్గం విష్ణుశిరోఽహరత్ ॥ ౬

తా॥ ఇంతలో చదపురుగు శార్ఙ్గమునుజేరి యా వారిని తెగగొఱికెను. అది భీకరమైన గొప్ప ధ్వనితో గూడి విష్ణువుయొక్క శిరస్సును దెగవేసెను.

శ్లో॥ తం దృష్ట్వా నిర్జరా స్సర్వే దిగ్భ్రమా న్మూర్ఛితాః ఖలు
అకస్మాత్ వ్యోమగం శీర్షం సురై రపి న దృశ్యతే ॥ ౭

తా॥ విష్ణువు శిరస్సు దెగినట్టి క్షణమున దేవతలందఱు దిగ్భ్రమజెంది మూర్ఛనొందిరి. అతివేగముగబోయిన యా విష్ణువు శిరస్సు దేవతలకు గనుపడదయ్యె.

శ్లో॥ తద్దృష్ట్వా మూర్ఛితా లక్ష్మీ అశ్రుపూరితలోచనా
తాం దేవీం ప్రార్థయామాస ప్రార్థయామాసు దేవతాః ॥

తా॥ అట్టి ఘోరవిపత్తును జూచి లక్ష్మీదేవి కన్నులనిండ నీరు కలదియై యాదిశక్తిని ప్రార్థించెను దేవతలును ప్రార్థించిరి.

శ్లో॥ సా ప్రత్యక్షవతీ దేవీ తాన్ సురాన్ ప్రత్యవోచయత్
యుష్మాభిః ప్రార్థితం కార్యం జానామి చింతయామిహి ॥

తా॥ ఆదిశక్తి యిట్లనుచున్నది. మీరు కోరిన కార్యమును తెలుసుకొంటిని. నేనును ఆలోచించుచున్నాను.

శ్లో॥ విష్ణో శ్శిరో దివ్యదృష్ట్యా అద్యాపి మే న బోధ్యతే
తస్మా న్మహాన్ విశ్వకర్మా ఉభయై రక్ష్య ప్రార్థితాన్ ॥

తా॥ తెగిపోయిన యీ విష్ణు శిరస్సును దివ్యదృష్టితో జూచినను నాకు గనఁబడుటలేదు. కనుక మన మెల్లరము గూడి మహానుభావుఁడగు విశ్వకర్మను బ్రార్థింతుము.

శ్లో॥ మహాదేవీవచః శ్రుత్వా ప్రార్థనం చక్రిరే సురాః
మహామతి ర్విశ్వకర్మా ప్రత్యక్ష మభవత్తదా ॥ ౧౩

తా॥ ఇట్లు దేవి చెప్పుటతోనే సురలెల్లరును నిశ్చల చిత్తముతో విశ్వకర్మను బ్రార్థించిరి. విశేష బుద్ధిశాలియగు నా విశ్వకర్మ దేవతలకు బ్రత్యక్ష మయ్యెను.

శ్లో॥ తత్క్షణా ద్విష్ణుశీర్షాయ త్రిదివేశాః యయాచిరే
స విశ్వసృట్ సమాలోచ్య ఛిత్వా గంధర్వమస్తకమ్ ॥

శ్లో॥ కబంధే స్థాపయామాస చాదదత్ ప్రాణపంచకం
సుప్రలాపా నువాచాశు స సుప్తా దుత్థితైవ హి॥ ౧౪

తా॥ దేవతలందరు విశ్వకర్మతో స్వామీ ! యీ విష్ణువు శిరస్సుతో గూడిన వానిగా జేయుమని యాచించిరి. ఆ మహా నీయుఁడు కొంచెమాలోచించి యశ్వముఖుడైన గంధర్వునియొక్క శిరస్సును దెగగొట్టి విష్ణువుయొక్క మొండె మున కతికించి పంచ ప్రాణముల నా యా స్థానములందు నిలిపెను. వెంటనే విష్ణువు నిద్రనుండి మేల్కొనిన వానివలె మాటలాడ మొదలిడెను.

శ్లో॥ పృచ్ఛతు స్తం హయగ్రీవం తే సురాః సంశయాన్వితాః
యద్యత్ పృచ్ఛంతి దేవాస్తే తత్త ద్భోదయతి క్షణాత్ ॥

తా॥ గుఱ్ఱపు మొగముతోనున్న విష్ణువునుగూర్చి దేవతలందరుశంకించి నిజమైన విష్ణువే యైనచో మన ప్రశ్నలకు సమాధాన మివ్వఁగలడని వారివారి యిష్టాను సారముగా బ్రశ్నించ నారంభించిరి. విష్ణుమూర్తి యా యా ప్రశ్నలకు వెంటనే సమాధాన మిచ్చుచుండెను.

శ్లో॥ ప్రణామ మకరో ద్దేవీ శ్రీ విరాడ్విశ్వకర్మణే
లక్ష్మీ సరస్వతీ నద్యఃక్షాళనం చక్రతుః పదౌ ॥ ౧౬



తా॥ మహానుభావుఁడగు విశ్వకర్మపదములకు దేవి నమస్కరించెను. లక్ష్మి సరస్వతు లిరువురు పదద్వయమును గడిగిరి

శ్లో॥ బ్రహ్మవిష్ణు శివేంద్రాద్యాః సంతుష్టాః విశ్వకర్మణః
భేజు స్తే విశ్వకర్తారం సృష్టిస్థిత్యంత కారణమ్॥ ౧౭

తా॥ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులును ఇంద్రాదులును మిగుల సంతోషముతో సృష్టి స్థితి లయకర్త యగు విశ్వకర్మను భక్తితో భజించిరి.

శ్లో॥ ఓంనమః పరమార్థాయ పురుషాయ మహాత్మనే
శుద్ధ సత్త్వ స్వరూపాయ మాయినే విశ్వకర్మణే॥ ౧౮

తా॥ పరమార్థ స్వరూపుఁడవు, మహాత్ముఁడవు. శుద్ధ సత్త్వస్వరూపుఁడవు. మహిమకలవాఁడవు, నగు నో విశ్వకర్మా ! నీకు నమస్కారము.

శ్లో॥ దివి భు వ్యంతరిక్షే వా పాతాలే వాఽపి సర్వశః
యత్కించి చ్ఛిల్పినాం శిల్పం తత్ప్రవర్తక తే నమః॥

శ్లో॥ విశ్వసంసారబీజాయ నమస్తే విశ్వమూర్తయే
విశ్వాయ విశ్వరూపాయ విశ్వకర్మ న్నమోఽస్తుతే॥

తా॥ స్వర్గలోకమునను. భూలోకమునను, అంతరిక్షమునందును, పాతాళ మునను ఒకటి యననేల అంతటనుగల శిల్పమునందు గన్పట్టువాఁడవును. ప్రపంచ మునకు మూలమైనవాఁడవును సమస్తమును , నీవేయైనవాఁడవును, సమస్త రూపము కలవాఁడవును, అగు నో విశ్వకర్మా ! నీ కొఱకు నమస్కారము.

శ్లో॥ యోజనో విశ్వకర్మాణం భక్తియుక్తేన చేతసా
ధ్యాయతే స క్షణే కాలే విపదశ్చాపి తరిష్యతి॥ ౨౧

తా॥ సూతు డిట్లు పలుకుచున్నాఁడు. ఓ మునులారా ! ఏ మానవుడు సద్భక్తియుక్తముగ విశ్వకర్మను ధ్యానించుచున్నాడో అతడు క్షణకాలములో ఆపదల నుండి విముక్తుడగుచున్నాడు.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం తృతీయోఽధ్యాయః॥

# అథ చతుర్థోఽధ్యాయః

శో॥ శృణుధ్వ మృషయస్స ర్వే ప్రభావం విశ్వకర్మణః
ఆసీద్దీర్ఘతమః పూర్వం గౌతమో భగవాన్ మునిః॥ ౧

తా॥ ఓ మునులారా! విశ్వకర్మ మాహాత్మ్యమును గూర్చిన మఱియొక కథను చెప్పుచున్నాను వినుఁడు. పూర్వము దీర్ఘతముఁడను నామాంతరముగల గౌతమ మహర్షి కలఁడు.

శో॥ అహల్యాతస్య భార్యా సీత్ సతీనాముత్తమోత్తమా
తస్యాజజ్ఞేఽంజనానామ్ని కన్యా రూప సమన్వితా॥ ౨

తా॥ ఆయనకు అహల్య యను పతివ్రత భార్యయై యుండెను ఆమెకు అంజనాదేవి అను సుందరి జనించెను.

శ్లో॥ యా పూర్వకారణాదంధా సాసీద్వాయోః కుటుంబినీ
తాం దృష్ట్వాఽచింతయద్వాయు ర్జగత్ప్రాణో మహానహం॥ ౩

తా॥ అంజనాదేవి యను నామె జాత్యంధయై వాయుదేవునికి భార్యగా నాయెను. వాయుదేవుఁడు తన మనస్సులో నేను మూఁడు లోకములకు ప్రాణమైనవాఁడను ఇంతటి గొప్పవాఁడనగు నాకీ జాత్యంధ కులసతి యయ్యెఁగదాయని విచారపడు చుండెను.

శో॥ ఏవం వేధస్యమేభార్యా జాత్యాంధా దైవయోగతః
ఇతి దుఃఖాకులాత్మాసా వుపాయం మనసాస్మరన్॥ ౪

తా॥ ఇట్లు వాయుదేవుఁడు విచారపడుచు తగిన యుపాయము మనస్సులో నాలోచించెను.

శో॥ మహామంత్ర మదా త్తస్యాః జాత్యంధ పరిహారకం
న్యగ్రోధమూలేదృష్ట్యర్థం చచార తపసిస్థిరాః॥ ౫



తా॥ జాత్యంధ పరిహారకమైన మహామంత్రమును అంజనాదేవి కుపదేశించెను. అమె మఱ్ఱి చెట్టు క్రింద పద్మాసనాసీనయై తపస్సు చేయుచుండెను.

శ్లో॥ ఏ తస్మి న్నంతరే శంభుః కైలాస శిఖరేస్థితః
దిదృక్షయా హి లోకానాం గగనాంతర మాగతః॥ ౬

తా॥ ఇంతలో కైలాసశిఖరమున నున్న శివుఁడు లోకములను చూడఁదలచి యాకాశమార్గమున వచ్చుచు.

శో॥ దృష్ట్వా మర్కటసంయోగం తద్దేతోః స్ఖలితేంద్రియః
ముమోచ వీర్యం దేవ స్త దంజనాంజలి మావిశత్॥ ౭

తా॥ మర్కటములయొక్క సంయోగమునుచూచి వీర్యస్ఖలితుఁడయ్యెను. ఆ వీర్య మంజనాదేవియొక్క దోసిటఁబడెను.

శో॥ సావా యుదత్త ఆహార ఇతి బుద్ధ్యాహ్యా భక్షయత్
యద్వీర్య మంజనా కుక్షి మాశ్రితం తత్త దేవహి॥ ౮

తా॥ ఆమె తన దోసిటఁబడ్డ వీర్యము వాయుదేవుఁడు తన కొసఁగిన యాహార మనియెంచి భుజించెను. ఆ వీర్యమంజనాదేవి గర్భమున ప్రవేశించి నంతనే.

శో॥ ప్రాప్తాసా చక్షు షోర్జ్ఞానం చరాచర విమర్శకం
నవభిర్ఘటికాభిశ్చ తద్గర్భోఽభూత్ ప్రవర్ధితః॥ ౯

తా॥ అంధత్వముపోయి సమస్తము కనుపడెను ఇంతేగాక తొమ్మిది ఘడియలలో గర్భము వృద్ధియాయెను.

శో॥ తద్గర్భ భారత్ క్లాంతాంగి శెశోచ పతి రంతికే
వాయురాహూతవాన్ శీఘ్రం బ్రహ్మ విష్ణు మహేశ్వరాన్॥

తా॥ ఆయొక్క గర్భభారముచేత బడలినదియై తనపతియగు వాయుదేవుని సమీపమున దుఃఖించెను. ఆతడును బ్రహ్మ విష్ణు మహేశ్వరులను బిలిచెను.

శ్లో॥ అజగ్ముస్తేపి పప్రచ్ఛుః కారణంతం దయాన్వితాః
గర్భభార పరిక్లాంతాం భార్యాం తేషాం నివేద్యచ॥ ౧౧

తా॥ ఆ త్రిమూర్తులువచ్చి దయతో వాయుదేవుని వీక్షించి కారణ మడిగిరి. అప్పుడు వాయుదేవుఁడు గర్భభారముతో బడలియున్న తన భార్యను వారికి జూపెను.

శ్లో॥ తథా విధాంచదృష్ట్వాతే ఆశ్చర్యాకులచే తసాః
సూనుం గర్భస్థమాహూయ మాతరం బాధసేకుతః॥

శ్లో॥ నిర్గచ్ఛ శీఘ్రమేతస్యాః గర్భాద్ద్వారం విమోచయ॥ ౧౩

తా॥ ఆ త్రిమూర్తులును ఆమె గర్భభారమును జూచి యచ్చెరువంది గర్భస్థ శిశువుతో నిట్లనిరి. ఓయీ నీవు నీ తల్లి నెందులకు శ్రమపెట్టుచున్నావు త్వరగా బయలుదేరి యీ గర్భ భారమునుండి యామెను విమోచనము చేయుము.

శ్లో॥ మాం మానప్రియం విత్త కౌపీనం బ్రహ్మసూత్రకం
దేయం కమండలుం యూయం నిర్గచ్ఛామిదయాపరాః॥

తా॥ గర్భస్థ శిశు విట్లు చెప్పుచున్నాఁడు. నేను మానవంతుఁడను. కనుక నాకు గోచి. జందెము, కమండలము ముఖ్యముగనవి యొసంగుడు యిప్పుడే జనియించెదను.

శ్లో॥ ఇత్యుక్తా శిశునాదేవా మంత్రయాం చక్రిరే మిథః
నవయం దాతుమేతాని విశ్వకర్మసమర్థకః॥ ౧౪

తా॥ ఇట్లు శిశువు చెప్పఁగనే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తమలో తామాలోచించి యీ వస్తువుల నొసఁగ మాకు శక్తిలేదు విశ్వకర్మయే సమర్థుఁడు.

శ్లో॥ అస్తిసామర్థ్యమేతేషాం దానే తస్య మహాత్మనః
ఇతి నిశ్చిత్యమనసా స్మరణం తస్యచక్రిరే॥ ౧౫

తా॥ ఆ మహనీయుఁడు ఇట్టి వెన్నియైన నొసంగుటకర్హుండు. అని నిశ్చయించి తమతమ మనస్సులో విశ్వకర్మను స్మరించిరి.



శ్లో॥ స్మరణాద్విశ్వకర్మాతు మేఘవాహన మాశ్రితః
పంచవక్త్రస్త్రి నేత్రోఽసౌ దశభిర్బాహుభిర్యుతః॥ ౧౮

శ్లో॥ ప్రాదురాసీ న్మహాతేజాః లోక కృజ్జగతీపతిః॥

తా॥ దేవతా శ్రేష్ఠులగు త్రిమూర్తులు స్మరించినంతనే మేఘవాహనా రూఢుండై పంచవక్త్రములతోను, ఫాలనేత్రములతోను, దశ బాహువులతోను విశ్వకర్మ ప్రత్యక్షమాయెను.

శ్లో॥ దృష్ట్వైవ బ్రహ్మరుద్రాద్యా నత్వాతే విశ్వకర్మణే
వృత్తాంతంసర్వమాచఖ్యు స్తచ్ఛ్రుత్వా తేవిస్మయంగతః
ఉవాచవచనంగర్భే నివిష్టం పురుషంతతః॥

తా॥ ఇట్లు ప్రత్యక్షమైనంతనే బ్రహ్మవిష్ణ్వాదులు విశ్వకర్మ భగవానునికి నమస్కరించి యావద్వృత్తాంతము విన్నవించిరి. ఆ మహనీయుఁ డిదివినతోడనే గర్భస్థ శిశువుతో నిట్లుపలికెను.

శ్లో॥ సౌవర్ణ కటి సూత్రంచ కౌపీనం బ్రహ్మసూత్రకం
గర్భ స్థితాయతే హేమ్నా రచితే శ్రుతి కుండలే॥ ౨౦

శ్లో॥ కర్తుందా తుం మహాకష్టం ప్రదాస్యామి తథాప్యహం॥

తా॥ ఓయీ! నీవు కోరినట్లు బంగారు మొలత్రాడును, యజ్ఞోప వీతమును, గోచియును, చెవులపోగులును యిచ్చుట కష్టతరము అయినప్పటికి నీవు కోరినందున యిచ్చెదను.

శ్లో॥ ఇత్యుక్తస్సోఽపి గర్భస్థః ప్రహృష్టో విశ్వకర్మణః
ప్రాహ గంభీరయా వాచా సంస్తువం లోక పూజితం॥ ౨౧

తా॥ ఇట్లు పలికినతోడనే యా గర్భశిశువు సంతోషము కలవాడై విశ్వకర్మను స్తుతించుచు గంభీరముగా నిట్లు వచించెను.

శ్లో॥ మదభీష్టాని సర్వాణి చేద్దా న్యసి జగద్గురో
గురుత్వాత్తవసర్వజ్ఞ త్వదాజ్ఞా భరితోఽస్మ్యహం॥

శ్లో॥ దాతా సమస్త దేవానాం త్వం వినా నాస్తి కర్శ్చిత్
కరోమి శాసనం తేఽ ద్య ఆజ్ఞాపయ జగద్గురోః॥

తా॥ జగద్గురుండవగునో విశ్వకర్మా ! నా కోరిన వస్తువుల నొసంగితివేవి, సమస్త దేవతలలో గొప్పవాఁడవు. దేవతలందఱిలో దాతవు. నీకంటె మఱియొక దాత యెచ్చటను లేఁడు. కావున సర్వదా నీ యాజ్ఞావశుఁడనై యుండెదను. నీవేమి శాసించుచున్నావో అది యిప్పుడే శాసింపుము. తప్పక నీ బంటునై యుందును.

శ్లో॥ ఏవముక్తో విశ్వకర్మా గర్భస్తే నోక్తవాక్ మహాన్
ధ్వజే మదీయే సంస్థిత్వా సదా ప్రకటితో భవ॥ ౨౪

తా॥ ఆగర్భస్థ శిశువుచే నిట్లు చెప్పఁబడినవాడై యా విశ్వకర్మయిట్లు శాసించెను. ఓయీ ! నీవు నాయొక్క ధ్వజము నుండి యెల్లప్పుడు ప్రకాశింపుము.

శ్లో॥ ఇతిపృష్టస్స పురుషో విశ్వకర్మాణ మబ్రవీత్
ధ్వజేవసామితే దేవ శాసనా ద్విరుదాంకితే ॥ ౨౫

తా॥ విశ్వకర్మ యీ రీతిగా జెప్పినంతనే యా గర్భస్థ శిశువు మరల నిట్లు వచించె. ఓ దేవా ! నీయాజ్ఞానువర్తినై నీ ధ్వజమున సర్వదా ప్రకాశింతును.

శ్లో॥ ఇత్యుక్తః పురుషేణాథ విశ్వకర్మా మహామతిః
సస్మార మనసా సర్వం తథైవ హి బభూవతత్ ॥ ౨౬

శ్లో॥ సర్వతః కాంచన మయం కౌపీనం బ్రహ్మ సూత్రకం
ఆదాయ కపి రూపేణ సౌవర్ణే కర్ణకుండలే ॥ ౨౭

తా॥ ఆ శిశువు పలికిన తోడనే మహామతి మంతుఁడగు విశ్వకర్మ తన మనస్సులోఁ దలఁచినంత మాత్రముననే కపి రూపముననున్న యా శిశువునకు కాంచనమయమగు కౌపీనము బ్రహ్మ సూత్రము, కటి సూత్రము, కుండలములు, కమండలువు అన్నియు నాయెను.

శ్లో॥ నిర్గమాత్రస్య పుత్త్రస్య పితరో మోదమాయతాం
హనుమానిత్య భిఖ్యాంచ కృత్వాతస్య మహాత్మనః ॥ ౨౮



తా॥ బహిర్గతుఁడయిన యా పుత్త్రునియొక్క తల్లిదండ్రులు సంతోషించినవారై యతనికి హనుమంతుఁడను నామకరణ మొనర్చిరి.

శ్లో॥ తత్రదేవా మహేంద్రాద్యాః సంతుష్టా విశ్వకర్మణః
భేజుస్తే విశ్వకర్తారం సృష్టిస్థిత్యంత కారణం॥

శ్లో॥ హనుమానపి సంతుష్టో ధ్వజారూఢస్థితోఽభవత్॥

తా॥ అచటనున్న దేవతలు, ఇంద్రాది దిక్పాలకులు, త్రిమూర్తులు, సంతోషించినవారై సృష్టి స్థితి లయ కారకుఁడగు నా విశ్వకర్మను భజించిరి. హనుమంతుఁడును సంతోషముతో విశ్వకర్మ యొక్క ధ్వజమున నుండెను.

శ్లో॥ యోజనో విశ్వకర్మాణం ధ్యాయతే ప్రత్యహం సుధీః
తస్యసంకల్పసిద్ధిస్స్యా దాయుష్మాన్ సభవిష్యతి॥ ౩౦

తా॥ యే మానవుఁడు నిత్యమును విశ్వకర్మను ధ్యానించుచున్నాఁడో అతనికి సంకల్పములు సిద్ధించుటయే కాక దీర్ఘాయుష్యవంతుఁడు నగుచున్నాఁడు.

ఇతి శ్రీ విశ్వకర్మ సంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మ కథాయాం చతుర్థోఽధ్యాయః

## అథ పంచమోఽధ్యాయః

శ్లో॥ అథాతః సంప్ర వక్ష్యామి పాపఘ్నం విశ్వకర్మణః
మాహాత్మ్యంలవాంఛితప్రాప్త్యం వక్తౄణాం శృణ్వతామపి॥

శ్లో॥ విశ్వకర్మ వ్రతం కృత్వా మఘ వాదైత్య దానవాన్
జితవాన్ సర్వసౌభాగ్యాన్ లేభేదివ్య తరాం పురా॥ ౨

తా॥ ఓ మునులారా ! కథను చెప్పువారికిని, వినువారికిని. పాపములను బోగొట్టునదియు, కోరికలను సిద్ధింపజేయునదియు, అగు విశ్వకర్మ మహాత్మ్యమును

గూర్చి మరియొక కథను జెప్పుచున్నాను. పూర్వము దేవతలకు రాజగు నింద్రుఁడు విశ్వకర్మవ్రతము నాచరించి దైత్యవర్గమును జయించి శ్రేష్ఠమైన సమస్త సౌభాగ్యములను బొందెను.

శ్లో॥ ఇంద్రస్త్రిభువ నైశ్వర్య మదోల్లంఘిత సత్పథః
మరుద్భిర్వసుభిరుద్రై రాదిత్యై ఋషిపుంగవైః॥ ౩

శ్లో॥ విశ్వే దేవైశ్చ సాధ్యైశ్చ నాసత్యాభ్యాం పరిశ్రితః
సిద్ధచారణ గంధర్వై ర్మని భిర్బ్రహ్మ వాదిభిః॥ ౪

శ్లో॥ విద్యా ధరోఽప్సరోభిశ్చ కిన్నరైః పతగోరగైః
స్తూయ మానస్సేవ్య మానో గీయమానో ఋషీశ్వరాః॥

శ్లో॥ పాండరే ణాత పత్రేణ చామర వ్యజనాదిభిః
విరాజమానః పౌలోమ్యా సహార్ధాసనయాభృశం ॥ ౬

తా॥ ఇంద్రుడు మూడులోకములయందు బ్రసిద్ధిగాంచిన యైశ్వర్య మదమున సన్మార్గము నతిక్రమించెను. దేవతలు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు ఋషులు, విశ్వదేవతలు, సిద్ధులు, సాధ్యులు, చారణులు, గంధర్వులు, అశ్వినీ దేవతలు, విద్యాధరులు, అప్సరులు, కిన్నరులు, గరుడులు, ఉరగులు, మున్నగువారు స్తుతిసేవ గీత నృత్యాదులతో వినోదము జూపుచుండ శ్వేతఛత్రము నీడను శచీసహితముగా సింహాసనమునుండి వింజామరలతో విసరించుకొనుచుండెను.

శ్లో॥ వాచస్పతిం నిజగురు మాచార్యం నాభ్యనందత
నోచ్చచాలాసనాదింద్రః పశ్యన్నపి సభాగతమ్॥ ౭

శ్లో॥ తతోనిర్గత్యసహసా కవిరాంగిరసః క్రుధా
అయయౌస్వగృహం తూష్ణీం సమ్యగ్బుధ్వాతిరస్క్రియాం

శ్లో॥ ఏతస్మిన్నంతరే విశ్వకర్మణో వ్రతమాగతః
అచార్యా భావహేతుత్వాత్తత్కర్తుం నసముద్యతః॥ ౯

తా॥ ఆ సమయమున దేవాచార్యుడును, తనగురువును, ఆచార్యుడును అగు బృహస్పతి యా సభకురాగా నింద్రుఁడా మహనీయుని జూచియును నమస్క



రించుటయు, సింహాసనము నుండి లేచి యెదురేగుటయు చేయలేదు. అది యప్పుడె తెలిసికొని యా బృహస్పతి యింద్రుని చేష్టలకు కోపమూని యేమియు ననక వెంటనే స్వగృహమున కరిగెను. ఇంతలో విశ్వకర్మ వ్రతమాచరించు కాలము సమీపించగా గురువు లేని కారణమున నింద్రుఁడా కార్యమును దలపెట్ట డయ్యెను.

శ్లో॥ ఏతస్మాత్కారణాదింద్రః పదభ్రష్టోఽభవత్కిల
నానాక్లేశ సమాకీర్ణో మతిభ్రష్టోతథాఽభవత్ । ౧౦

శ్లో॥ అకస్మాద్దానవాస్సర్వే ఔశనస్యాపి మాయయా
దేవాన్ ప్రత్యుద్గమంచక్రు ర్దుర్మదా ఆతతాయినః ॥ ౧౧

శ్లో॥ త్రైర్విసృష్టేషుభిస్తిగ్మై ర్నిర్భినాం గోరుబాహవః
కథం నివృత్తి రస్మాక మిత్యాలోచ్యాఖిలాః సురాః ॥ ౧౨

తా॥ విశ్వకర్మ వ్రతమును బరిత్యజించుటచే ఇంద్రుఁడు నానా దుఃఖముల ననుభవించుచు మనస్సు చెడినవాడై యధికారము నుండి తొలఁగింపఁబడెను. శుక్రాచార్యుడు దివ్యదృష్టిచే నీ విషయమును దెలిసికొని తన మంత్రబలముతో దానవులకు సహాయ మొనర్చుచు నాకస్మికముగా స్వర్గమును ముట్టడింపజేసెను. ఆ సమయమున నింద్రుఁడు పారిపోవుటయే కాక యధికశరాహతులైన సురలెల్లరు గూడి యా యుపద్రవము నెట్లు తప్పించుకొనగలమనుకొనుచుండిరి.

శ్లో॥ కిమిదం కస్య మాహాత్మ్యం మన్సా వాచామ గోచరం
ఐంద్రజాలిక విద్యాయాం సుధృడస్సోశనో మహన్ ॥ ౧౩

శ్లో॥ చింతమానా స్సురాస్సర్వే బభూ వుర్నితరాం తతః
పులోమ జాపి భర్తార్యా దృష్ట్వా భీత్యా రురోదహ ॥ ౧౪

శ్లోః మఘవ్యాకులో భూత్వా తాన్ సురాన్ ప్రత్యవోచయత్
విశ్వకర్మ వ్రతంత్యక్త్వా నానారిష్టానవాప్నుమః ॥ ౧౫

తా॥ ఇదియేమిటి ఎవరియొక్క మహిమయైయుండును. మనస్సుతో బరిశీలించుటకు గాని వాక్కుతో వర్ణించుటకుగాని యసాధ్యమైయున్నది. మఱియు నాతఁడింద్రజాల విద్యయందు గొప్పవాఁడు. ఇట్లు దేవతలు విచారపడుచుండిరి.

శచీదేవియును భర్తనుగాంచి మిగుల దుఃఖింప నారంభించెను. ఇంద్రుఁడును కలత పడిన మనస్సుతో మనము విశ్వకర్మ వ్రతమును ద్రోసిపుచ్చి, మితిలేని యిక్కట్లు పాలగుచుంటిమి అని పదే పదే విచారపడుచుండెను.

శ్లో॥ ఇదానీంచేద్య వాభ్యాంవైకార యిష్యామహేవ్రతం
ఇత్యుదీర్య సురాస్సర్వే య యు స్సుర గురోర్గృహం॥

శ్లో॥ బృహస్పతిర్గతోఽదృశ్యాం గతిమాధ్యాత్మమాయయా
గురోర్నాధి గతం జ్ఞాత్వా సురాన్ దృష్ట్వోత్తమ బ్రవీత్॥

తా॥ అట్లయినచో మీచేత నిప్పుడే విశ్వకర్మవ్రతము నాచరింపఁ జేయుదు మని దేవతలందరును గూడి యా బృహస్పతి నివాసమున కరిగిరి. ఆతఁడాధ్యాత్మ మహిమచేతఁ దిరోహితుఁడయ్యెను. సురాచార్యుఁడు కనబడనందుల కింద్రుఁడు విచారపడి దేవతలను జూచి యిట్లనియె.

శ్లో॥ అహోబల మమాసాధు కృతంవైద భ్రబుద్ధి నా
కించిద్ధర్మమనుస్మృత్య గురుణాహం బహిష్కృతః ॥ ౧౮

శ్లో॥ కాగతిఃకః సమర్థోఽద్య కింకరోమ్యార్త్తవానసి
బ్రహ్మణం శరణంజగ్ముః సహేంద్రానత కంధరాః ॥ ౧౯

తా॥ అయ్యో ఎంతచెడ్డపని చేసితిని అల్పబుద్ధిచే గొంచెపు ధర్మముల ననుసరించి నా గురువగు బృహస్పతికి దూరమైతిని ఇప్పుడు నాగతి ఏమి ? ఈ ముప్పును దప్పింప సమర్థుఁడెవడు ? ఆర్తుఁడనైన నేనిపుడేమి చేయఁగలను. అంత నింద్రునితో సహా దేవతలెల్లరును బ్రహ్మయొద్దకువెళ్ళి నమస్కరించి మమ్ము రక్షింపుమని ప్రార్థించిరి.

శ్లో॥ తాన్సురాన్ వీక్ష్యచోవాచ కృపయా సాంత్వయన్నజః
అహోబత సురాయూయమైశ్వర్యా ద్రాహ్మణంగురుం ॥

శ్లో॥ తిరస్కృత్యపరేభ్యోహి ప్రాప్నుథస్మపరాభవం
మఘవన్ ద్విషతఃపశ్య కావ్యమారాధ్యభక్తితః ॥ ౨౧



శ్లో॥ ప్రాప్తత్రివిష్టపాన్ భూయః సంప్రత్యుపచిత శ్రియః
గోవిప్రభగవద్వేషి హ్య భద్రంలభతేచిరం ॥ ౨౨

తా॥ బ్రహ్మ యా దేవతలను జూచి దయతో వారల నోదార్చుచు నిట్లు పలికెను. మీరలైశ్వర్య మదముచేత బ్రాహ్మణుడును ఆచార్యుండును అగు బృహస్పతిని దిరస్కరించి శత్రువులకు నోడి యిక్కట్లు పడుచుంటిరి సురపతీ ! భక్తితో శుక్రునారాధించి స్వర్గమునుబొంది యైశ్వర్య యుతులైయున్న నీ పగతురఁ జూడుము. గోవులయందును, బ్రాహ్మణుల యందును, భగవంతుని యందును పగఁబూనిన వాఁడెప్పుడును కీడుబొందుచునే యుండును.

శ్లో॥ తద్విశ్వరూపమాచార్యం భజతాశు తపస్వినం
త్వాష్ట్రం సదాస్యతే కామాన్ సర్వాన్ వోవిప్రపుంగవః ॥

శ్లో॥ తే ఏవ ముదితా సద్యః బ్రహ్మణా విగతజ్వరాః
ఋషింత్వాష్ట్రముపవ్రజ్య పరిష్వజ్యేద మబ్రువన్ ॥ ౨౪

తా॥ ఆ కారణమువలన మీరు త్వరగా వెళ్ళి త్వష్టృకుమారుఁడును, తపస్వియును, అగు విశ్వరూపాచార్యుని సేవింపుడు. బ్రాహ్మణ శ్రేష్ఠుఁడగు నాతడు మీ కోరికల నన్నింటిని సిద్ధింపఁజేయును. బ్రహ్మ యిట్లు చెప్పగా దుఃఖము నుడిగినవారై సుర లప్పుడే విశ్వరూపునియొద్దకుజేరి యిట్లర్థించిరి

శ్లో॥ తపసాపనయం స్తాత సందేశం కర్తుమర్హసి
నమస్కుర్మః ప్రసీదస్తే ఆచార్యం త్వాం వృణీమహే ॥

తా॥ బాబూ ! మా యొక్క విచారమును నీ తపోమహిమచేఁ బోగొట్టి మమ్ముల రక్షింపుము. మా వందనముల స్వీకరించి యాచార్యత్వమును కను గ్రహింపుము.

శ్లో॥ ఇత్యర్థిత స్సురగణైః పౌరోహిత్యే మహాతపాః
స విశ్వరూప స్తానాహ ప్రహసన్శ్లక్ష్ణయాగిరా ॥ ౨౬

శ్లో॥ విగర్హితం ధర్మశీలైః లోకే శైర్యాచితంత్వహూ
భవతాం ప్రార్థితాం సర్వం ప్రాణైరర్థైశ్చ సాథయే॥ ౨౭

తా॥ ఇట్లు దేవతలచేఁ బ్రార్థింపఁబడి మహాతపశ్శాలియగు విశ్వరూపుఁడు చిఱునవ్వుతో నిట్లు పలికెను. ధర్మవేత్తలచే నింపింపఁబడిన పౌరోహిత్యమును బ్రహ్మదులు కోరుటచేతను మీరెల్లరు బ్రార్థించుటచేతను, నంగీకరించుచున్నాను. నా శక్తి కొలది మీ కోరిన యర్థంబు సాధించెదను.

శ్లో॥ తేభ్య ఏవం ప్రతిశ్రుత్య విశ్వరూపో మహాతపాః
పౌరోహిత్యం వృతంచక్రే పరమేణ సమాధినా ॥

శ్లో॥ పూర్వమేవకృతే స్తస్యాస్తమింద్రం ప్రత్యవోచయత్
వ్రతం కుర్తుం ప్రతిజ్ఞాయ సద్భక్త్యా విశ్వకర్మణః ॥ ౨౯

శ్లో॥ తత స్త్రి విష్టపం గత్వా కురు దేవేశ సాంప్రతం
ఇత్యుక్త్వా విశ్వరూపేణా వ్యత్యుత్వా హేనసోఽంజసా, ॥

తా॥ ఆ దేవతలయొక్క ప్రార్థనవిని విశ్వరూపుఁ డుత్కృష్టమైన నియమముతో బురోహిత కార్యము నిర్వరించెను. ముందుగానే యింద్రునితో నిట్లు చెప్పెను. ఓయీ! నీ విప్పుడనే విశ్వకర్మ వ్రతము నాచరింపఁ బ్రతిజ్ఞచేసి భవన్నిలయంబునకు జని వెంటనే సద్భక్తితో వ్రతమాచరింపుము. విశ్వరూపుఁడిట్లు చెప్పగా విని యింద్రుఁడు మిక్కిలి యుత్సాహము కలవాఁడై వెంటనే.

శ్లో॥ తథా ఏవ ప్రతిజ్ఞాయ నత్వా శ్రీవిశ్వకర్మణో
అమరై ర్విశ్వరూపేణ సహనిర్గతవాన్ దివం ॥ 3౧

శ్లో॥ త్రివిష్టప గతస్సేంద్రో వ్రతంచక్రే యథావిధి
తదాచార్యో విశ్వరూపః కథాంసాంగమవోచయత్ ॥ 3౨

శ్లో॥ విశ్వకర్మ ప్రసాదేన జిత్వావై దానవాన్ దివం
నితరాంధర్మయుక్తస్సన్ చిరకాల మపాలయత్ ॥ 33

తా॥ ఆ ప్రకారముగా విశ్వకర్మ భగవానునికి నమస్కరించి వ్రత మాచరింపఁ బ్రతిజ్ఞచేసి యా విశ్వరూపుని దేవతలనుగూడి స్వర్గమునకుఁబోయెను.



అంతటఁగలోక్తముగా విశ్వకర్మవ్రతమును జేయఁగా విశ్వరూపుఁడు పౌరోహిత్యమును నెఱవేర్చి కథనుగూడ చెప్పెను. ఆ విశ్వకర్మయొక్క యనుగ్రహముచేత దానవులనుజయించి స్వర్గమును బహుకాలము న్యాయముతోఁబాలించెను.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం పంచమోఽధ్యాయః॥

## అథ షష్ఠోఽధ్యాయః

శ్లో॥ పునరగ్రే ప్రవక్ష్యామి శృణుధ్వంముని సత్తమాః
పురా రామోవనం యాతో వర్షాణ్యేవ చతుర్దశః ॥ ౧

తా॥ ఓ మునులారా! ఇప్పుడు తిరిగి మఱియొక కథను జెప్పుచున్నాను. వినుఁడు. పూర్వకాలమున రాముఁడు పదునాలుగు సంవత్సరములు వనవాసము చేసెను.

శ్లో॥ న్యవసత్ పంచ వట్యాంచ ససీతస్సహ లక్ష్మణః
తత్రైవ వనతస్తస్య రావణేన హృతాసతీ ॥ ౨

తా॥ ఆ వనవాసము చేయునప్పుడు సీతాదేవి లక్ష్మణులతోఁ గూడి పంచవటీ క్షేత్రమున నుండెను. అప్పుడుండగా నతనియొక్క భార్యను రావణుఁ డెత్తుకొని పోయెను.

శ్లో॥ తేన దుఃఖేన రామోఽసౌ మోహమప్యగమత్తదా
వ్రజన్ జటాయుషం భూమౌ దదర్శ విగతా యుషమ్ ॥ 3

తా॥ రాముఁడుభార్య కనఁబడనందున దుఃఖముచేత సంసారభ్రాంతి కలవాఁడై తన భార్యను వెదుకుటకు బయలుదేరి మార్గములోఁ గొనప్రాణముతో నున్న జటాయువును జూచెను.

శ్లో॥ కబంధో నిహతః పశ్చాద్భ్రమన్నారణ్య మధ్యగః
సుగ్రీవేణ సమంతస్య సఖిత్వం సమాజాయత ॥ ౪
సహాయార్థం ప్రేషితాని వానరాణాం బలానివై ॥

తా॥ పిమ్మట సీతను వెదకుచు నరణ్యమందున్న కబంధుఁడను రక్కసుని జంపెను. తదుపరి సుగ్రీవుఁడను వానరరాజుయొక్క స్నేహము కలిగి యతనివలన బంపఁబడిన వానర సైన్యమును గ్రహించెను.

శ్లో॥ తతో హనుమతా దృష్టా లంకోద్యానేతు జానకీ
రామాస్యాజ్ఞాం నవేద్యాథ దూతకర్మ మహత్కృతం ॥ ౫

తా॥ పిదప వానరసేనలో నొకఁడయిన హనుమంతుఁడు లంకాపట్టణమును ప్రవేశించి యుద్యానవనమునందు సీతను జూచెను. ఆ ప్రకారము సీతను గూర్చి యింకను శత్రుబలాబలమును దెలిసికొనుట మొదలగు భటుఁడు చేయవలసిన కార్యములన్నియుఁ జేసెను.

శ్లో॥ సమేత్య రామస్య పున స్సర్వం తత్ర నివేదితం
అథశ్రుత్వా రామచంద్రో వాక్యతశ్చ హనూమతః ॥

తా॥ పిమ్మట తిరిగివచ్చి రామున కాలంకయందున్న సంగతులన్నింటిని జెప్పెను. తరువాత రాముఁ డాసంగతులను విని యా హనుమంతుని వాక్యప్రకారము,

శ్లో॥ సుగ్రీవ ప్రముఖైస్సార్థం ప్రస్థానం సమరోచయత్ ౬
సగత్వాతు శనైస్తీరం తతో నదనదీపతేః ॥

తా॥ సుగ్రీవుఁడు మొదలగు వానరులతోఁగదలి మెల్లగా సముద్రతీర మునుచేరెను

శ్లో॥ సేతునిర్మాణ మాలోచ్య ప్రస్తరాన్ పర్వతోపమాన్ ౭
ఆనీయ వానరాస్సర్వే సాగరే పాత యంతిహి ॥

తా॥ పిమ్మట వారధిగట్టఁదలచి వానరులందరును కొండలవంటిఱాలనుదెచ్చి జూలనిధి యందుఁబడవేయుచుండిరి.
[illegible]



శ్లో॥ పర్వతానాం సహస్రైశ్చ సముద్రస్తు నబధ్యతే
అనేకశోఽనేకధా తత్ప్రయత్నమ భవతత్తః ॥ ౯

తా॥ అటుల వేలకొలఁది కొండలను దెచ్చి వైచుచుండినను సముద్రము కట్టుపడలేదు, ఇట్లనేకమారు లనేకవిధములుగాఁ బ్రయత్నించి విఫలమనోరథులైరి.

శ్లో॥ తందృష్ట్వా రాఘవో భీత్యా లక్ష్మణం ప్రతిచాబ్రవీత్
కిమిదం మహదాశ్చర్యం మయాన జ్ఞాయతేఽనుజ ॥ ౧౦

తా॥ అప్పుడు రాముఁడు చూచి భయపడి లక్ష్మణునితో నిట్లు పలికెను. తమ్ముఁడా! ఇది యేమి యాశ్చర్యమో నాకుఁ దెలియుటలేదు.

శ్లో॥ అద్యాపి సాగరే సర్వే స్థాపితాః ప్రస్తరా అమీ
క్షణేనాం తదధం తి స్మ ఏకోపత్ర న తిష్ఠతి ॥ ౧౧

తా॥ ఇంతవరకు సముద్రముననుంచిన ఱాలన్నియు వెంటనే నీటిలోనే మాయమైనవి. ఇచట నొకటియును లేదు.

శ్లో॥ మయైతా దృజ్మహా వార్ధిః కథం సంబధ్యతేఽధునా
సౌమిత్రే కేన పుణ్యేన తరిష్యే వరుణాలయమ్ ॥ ౧౨

తా॥ ఓ లక్ష్మణా! ఇటువంటి మహాసముద్రమునకు నిపుడెటుల వంతెన గట్టఁగలను. ఏ పుణ్యముచే దీనిని దాటఁగలను.

లక్ష్మణ ఉవాచ :

శ్లో॥ విదితాత్మా త్వమేవాసి దీర్ఘదర్శి నరోత్తమ ॥ ౧౩
బక ధాల్భ్య మునిశ్చాత్ర మహానాశ్రమ మధ్యగః
అస్మాత్స్థానాద్యో జనార్ధ మాశ్రమ స్తస్య రాఘవః ॥ ౧౪

తా॥ లక్ష్మణుఁడు చెప్పుచున్నాఁడు ఓ రామా! నీవే యాత్మజ్ఞానము కలవాఁడవు. దూరాలోచన పరుఁడవు. నీకుఁ దెలియని దేమున్నది. అయినను నన్నడిగితివి గాన చెప్పెదను వినుము. ఇచ్చట బకదాల్భ్యుఁడను మహర్షి యొక్క యాశ్రమము కలదు అది యిచటికి రెండుకోసుల దూరముండును.

శ్లో॥ అనేనదృష్ట్వా బహవో కల్పాస్తం రఘునందన
తంపృచ్ఛ సత్వరంగత్వా పురాణం మునిపుంగవం ॥ ౧౫

తా॥ ఈ బకదాల్భ్యముని యనేక బ్రహ్మకల్పములు చూచినవాఁడు కనుక వయోజ్యేష్ఠుఁడును, తపోధనుఁడును అగు నా మునినడుగుము.

శ్లో॥ ఇతివాక్యం తతశ్శ్రుత్వా లక్ష్మణస్యాతి శోభనం
రామో జగామ తంద్రష్టుంబకదాల్భ్యమహామునిం ॥

తా॥ లక్ష్మణుఁడిట్లు చెప్పఁగా విని రాముఁడు బకదాల్భ్యుని జూచుట కాశ్రమమునకుఁ బోయెను.

శ్లో॥ నవామ మునినాపృష్టః కుతో రామ సమాగమః
ఏవముక్తస్తు మునినా రామోవాక్య మథాబ్రవీత్ ॥ ౧౬

తా॥ ఆశ్రమమునకు వెళ్ళి యా బకదాల్భ్యమునికి నమస్కరించినంతనే రామా ! ఎందులకై యిటకువచ్చితివని యడుగ నతఁడిట్లు సమాధానమిచ్చెను.

శ్లో॥ మహర్షేఽహం త్వత్ప్రసాదాత్తీరం నదనదీపతేః
ఆగతోఽస్మి ససైన్యోఽన్య లంకాం జేతుం సరాక్షసాం ౧౭

తా॥ ఓ మహామునీ నీ యనుగ్రహము వలన రాక్షసులతోఁ గూడ లంకాపట్టణమును జయించుటకు వానరసేనలతోఁ గూడి సముద్రతీరమునకు వచ్చియుంటిని.

శ్లో॥ భవత్ప్రసాదా దుదధిం తరిష్యామి నచాన్యథా
తదుపాయం వదమునే ప్రసాదం కురుసువ్రత ॥ ౧౮

తా॥ మంచి ప్రవర్తనము గల యో బకదాల్భ్యమునీ ! నీ యనుగ్రహము వలన సముద్రతీరమును దాఁటవలయును. కాని అది దాఁటనలవికాకున్నది. కనుక నాయందనుగ్రహించి తగిన యుపాయమును సెలవిమ్ము.

శ్లో॥ ఏతస్మాత్కారణాత్స్వామిన్ త్వత్సమీప ముపాగతః
ఇత్యుక్తో రామచంద్రేణముని ప్రోవాశ సాదరం ॥ ౨౦

ఉప్పునూతుల గురుసాయి ఆచార్యులు



తా॥ ఈ హేతువువలన నీ సమీపమునకు జేరితినని రాముఁడు విన్నవింపఁగా బకదాల్భ్యముని యాదరముతో నిట్లు చెప్పెను.

శ్లో॥ శ్రుణురాఘవ వక్ష్యామి సర్వ దుఃఖ వినాశకం
ఏకాగ్ర మానసో భూత్వా వ్రతమేతత్ సమాచర॥ ౨౧

తా॥ ఓ రామా ! సమస్త దుఃఖనాశకమగు వ్రతము నొకదానిని జెప్పెదను దానిని స్థిరచిత్తము కలిగి చేయవలెను.

శ్లో॥ విశ్వకర్మా మహాదేవో వాంచితార్థ ఫలప్రదః
తస్యైన పూజనాద్రామ విజయస్తో భవిష్యసి॥

తా॥ మానవులకుఁ గోరికల నిచ్చువాఁడు విశ్వకర్మ. ఆ దేవుని నీవు తప్పక పూజించినట్లయిన జయము కలుగును.

శ్లో॥ నిస్సంశయం సముద్రం త్వం తరిష్యసి సవానరః
తద్వ్రతోక్త విధానేన పూజయస్వ సలక్ష్మణః॥

తా॥ నిశ్చయముగా నీయగాధమగు సముద్రమును నీ సేనతోఁ గూడ దాఁటఁగలవు. ఆ వ్రతమునకుఁ జెప్పిన విధితో లక్ష్మణునితోఁ గూడిన వాఁడవై పూజింపుము.

శ్లో॥ విశ్వకర్మాన్వయో ద్భూతం సత్యవ్రత పరాయణం
నలం సంపూజ్యతం పృచ్ఛ తద్విధానం స బోధతే॥

తా॥ విశ్వకర్మవంశమునఁ బుట్టినవాఁడును. సత్యశీలుఁడును, విశ్వకర్మ వ్రతమునందెడతెగని యాసక్తి కలవాఁడును. అగు నలునిబూజించి యడుగుము. ఆ వ్రత విధానమంతయు నతఁడే నీకుఁ జెప్పును.

శ్లో॥ రామ స్సద్య స్సమాకర్ణ్య స్వస్థానం గతవాన్ తతః
సలక్ష్మణో నలం ప్రాప్య నమస్కృత్యే త్యవోచయత్॥

తా॥ రాముఁడా వాక్యములను వినినవాఁడై త్వరగా సాగరతీరమునకు జేరి తమ్ముఁడగు లక్ష్మణునితోఁగూడి నలునియొద్దకువెళ్ళి యతనికి నమస్కరించి యిట్లు పలికెను.

శ్లో॥ అహో నిత్యవ్రతాసక్త నాస్మాభిర్జ్ఞాయతేనల
వర్ణ్యతే తవ ప్రఖ్యాతి ర్వక దాల్భ్య మహర్షిణా॥

తా॥ వ్రతనిష్ఠాపరుఁడవగు నో నలుఁడా! నీ యొక్క ప్రసిద్ధి బక దాల్భ్య మహర్షికిఁగూడఁ దెలియును. ఆ మహానుభావుఁడు చెప్పఁగా నేనువిని తెలిసి కొంటిని గాని యంతకుమున్ను మాకుఁ దెలియక పోయెనుగదా!

శ్లో॥ విశ్వకర్మ వ్రతం కార్య మధునా విధినా మయా
పౌరోహిత్యం కురుక్షిప్రం కథాశ్చా చక్ష్వకోవిద॥

తా॥ నేనిప్పుడు శాస్త్రోక్తముగా విశ్వకర్మవ్రతమును జేయఁదలంచితిని నీవదటి పురోహిత కార్యమును నెఱవేర్చి కథలను జెప్పవలయును.

శ్లో॥ నలోఽపి సమ్యగస్త్వితి త మంగీకృత వాన థ
సానందో భక్తియుక్తస్సన్ వ్రతం చక్రే సరాఘవః॥

తా॥ నలుఁడును మంచిదని యంగీకరింపఁగా రాముఁడు సంతోషించి పరమ భక్తితో వ్రతము నాచరించెను.

శ్లో॥ వ్రతాంతే తత్ప్రసాదంచ సద్భక్త్యా రాఘవోఽభునక్
లక్ష్మణః కపయస్స ర్వే ప్యభుంజన్ స్థిర చేతసా॥

తా॥ వ్రతాంతమున నా ప్రసాదమును రాముఁడు భక్తితో భుజించెను. లక్ష్మణుఁడును వానరులందరును భక్తియుక్తులై భుజించిరి.

శ్లో॥ కించి త్సనలహస్తేన విన్యస్త ప్రస్తరాచమే
తేసర్వేఽపిప్లవంతేఽబ్ధౌ ఘటతే సేతుబంధనం॥ 30

తా॥ ఆ నలునియొక్క హస్తము తగిలిన రాలన్నియు జలమునందు నిలుచు చున్నవేకాని యేమాత్రము మునుంగవయ్యెను ఈ ప్రకారము వంతెన తయారగు చున్నది.

శ్లో॥ తం సేతుం రాఘవో దృష్ట్వా విస్మితాత్మోఽభవత్తదా
లక్ష్మణశ్చాపి తుష్టోఽభూ ద్వానరా శ్చలయంతిహి॥



తా॥ రాముఁడా కట్టడమునుజూచి యాశ్చర్యము నొందెను. లక్ష్మణుఁడును సంతోషించెను. వానరులందఱును దానిని గదలింపఁజూచిరి.

శ్లో॥ మర్కటౌఘై స్సహసైశ్చనచచాల హిమాద్రివత్
వాలేన వేష్ట్య హనుమా నకర్ష ద్ఘటికాత్రయం॥

తా॥ అటులఁ గదలించుచున్న వానరసేనలకా సేతువు కొంచెమైనను గదలక హిమవత్పర్వతమువలె గట్టిగానుండెను. అప్పుడు హనుమంతుఁడు తన తోకతోఁ జుట్టి మూడు గడియలకాలము లాగి చూచెను.

శ్లో॥ తస్మాల్లజ్జావశో భూత్వా సేతురేవం స్థితేసతి
హనుమాన్నలపాదాభ్యాంసాష్టాంగే నానమత్స్వయం॥

తా॥ తనశక్తి వంతయుజూపి లాగినను వంతెన కదలకుండుటచే హనుమంతుఁడు సిగ్గుపడి తనంతటతానే యా నలునియొక్క పాదములకు సాష్టాంగ నమస్కారము చేసెను.

శ్లో॥ ఏతద్వ్రతఫలాద్రామ స్సముద్ర మతరత్తతః
ప్రాప్తా సీతాజితా లంకా పౌలస్త్యోనిహతో రణే॥ 34

తా॥ ఈ వ్రతఫలముచేత రాముఁడు సముద్రముదాటి రావణుని యుద్ధమునందు జంపి, లంకాపట్టణమును జయించి, సీతను దీసికొనివచ్చెను.

శ్లో॥ యశ్శృణోతి ఇదం దివ్యం రహస్య మృషిభిః కృతం
సనిష్పాపో విశుద్ధాత్మా విశ్వకర్మ ప్రసాదత॥ 35

శ్లో॥ పుత్రపౌత్రాభివృద్ధిస్స్యా త్సుఖీ విజయీ భవేత్
దేహాంతేవిశ్వకర్మాఖ్యం సాయుజ్యం పదమాప్నుయాత్॥

తా॥ మహర్షులచేఁ జెప్పఁబడిన యీ పరమరహస్యము నెవఁడు వినుచున్నాఁడో యతఁడు విశ్వకర్మ యనుగ్రహమువలనఁ బాపరహితుండును, పరిశుద్ధుఁడును, అగుచున్నాఁడు. అతనికిఁ బుత్రపౌత్రాభివృద్ధి కలుగును. సుఖము, జయము

కలవాఁ డగును జీవితాంతమున సత్యలోకమున విశ్వకర్మయొక్క సాయుజ్యమును బొందును.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం షష్ఠోఽధ్యాయః॥

## ౭ అథ సప్తమోఽధ్యాయః

శ్లో॥ అథాన్యత్సం ప్రవక్ష్యామి శృణుధ్వం మునిసత్తమా
ద్వాపరస్య యుగస్యాంతే ఆసీ త్కృష్ణో యదూత్తమః ॥ ౧

తా॥ ఓమునిశ్రేష్ఠులారా! మఱియొక కథను జెప్పుచున్నాను వినుఁడు ద్వాపర యుగాంతమున యదువంశమున శ్రేష్ఠుఁడగు కృష్ణుఁ డుదయించెను.

శ్లో॥ ఆత్మవాన్ ధృతిమాన్ శ్రీమాన్ వాగ్మీ కుశలబుద్ధిమాన్
సర్వజ్ఞో యుక్తిశాలీ చ విద్వాన్ రూపసమన్వితః ॥ ౨

తా॥ అతఁడు రూపవంతుఁడును, చదువరియును, దైవభక్తిపరుఁడును ధైర్యవంతుఁడును. సంపద్యుక్తుఁడును, యుక్తియుక్తముగా మాటలాడువాఁడును, ప్రజ్ఞావంతుఁడును, యుక్తిశాలియును, సమస్తము నెఱిఁగినవాఁడును అయియుండెను.

శ్లో॥ ఏకస్మిన్ దివసే కాల యవనో మాగధశ్చతౌ
ఉభౌ మిళిత్వా మధురాం చక్రతుః పరివేష్టినమ్ ॥ ౩

తా॥ ఒకనాఁడు కాలయవనుఁడును, మగధ దేశాధిపతియగు జరాసంధుఁడును గూడి యాకస్మికముగా దాడిచేసి మధురాపురమును ముట్టడించిరి.

శ్లో॥ అద్యాహం కింకరో మీతి భయాపనయనం కథం
విశ్వకర్మన్ మహాదేవ లోకానా మీశ్వరః పితా ॥ ౪



శ్లో॥ త్వమేవ సృష్టిసంహార కర్తాచ సర్వకామదః
త్వంతు రూపాణ్య నేకాని రజస్తమోయుతానిచ ॥ ౫

శ్లో॥ కృత్వా సృజసి లోకాంస్త్రీన్ జగచ్చ సచరాచరం
తస్మాద్విశ్వపతే రక్ష దద్యమాం శత్రుపీడితం ॥

శ్లో॥ త్వం వినాఽన్యగతిం దేవ నపశ్యామి జగత్త్రయే
సంసృజ్య సాగరే మధ్యే శీఘ్రం మే దీయతాంపురీ ॥ ౭

శ్లో॥ ముహు ర్ముహుర్నమస్కృత్వా ఇతి శ్రీవిశ్వకర్మణే
యథావిధి వ్రతంచక్రే భక్త్యా బంధుజనైః స్సహ ॥ ౮

తా॥ అప్పుడు కృష్ణుఁ డీ భయము తొలఁగుట యెట్లు! నే నిప్పు డేమి చేయుదును. అని తన మనస్సున నిట్లు ధ్యానించెను. మహాదేవుఁడవగు నో విశ్వకర్మా! నీవే యీ సమస్త లోకములకు నధిపతివి. నీవే తండ్రివి. సృష్టింపను సంహరింపను కర్తవు. అన్ని కోరికల నిచ్చువాడవు! సమస్త చరాచరాత్మకమైన యీ మూడు లోకములను సృష్టించి రజస్తమోయుతములై యొప్పు ననేకరూపములతో నుందువు. జగన్నాథుఁడ వగునో దేవా! శత్రుబాధితుఁడనై యున్న నన్ను రక్షింపుము. ఈ మూఁడులోకముల యందును నీవు దక్క వేఱొక దైవమును నేను చూచియుండలేదు. కావున సముద్ర మధ్యమమున నొక పట్టణమును నిర్మించి నాకు దయసేయుము. ఇట్లు మాటిమాటికి నమస్కరించుచు బంధువర్గముతో గూడి విధ్యుక్తముగా విశ్వకర్మ వ్రతము నాచరించెను.

శ్లో॥ తస్మిన్ కాలే ప్రసన్నోఽభూ ద్విశ్వకర్మా క్షణేనవై
అంతస్సముద్రే నగరం కృత్వాన్వద్భుత మచీకరత్ ॥ ౯

శ్లో॥ దృశ్యతే యత్ర హి త్వాష్ట్రం విజ్ఞానం శిల్ప నైపుణ్యం
రథ్యా చత్వరవీధీభి ర్యథా వాస్తు వినిర్మితం ॥ ౧౦

శ్లో॥ సురద్రుమ లతో ద్యాన విచిత్రోపవనాన్వితం
హేమశృంగైర్విసృగ్భి స్ఫాటికాట్టాల గోపురైః ॥ ౧౧

శ్లో॥ రజతాదికుడ్యైర్జుష్టం హేమకుంభై స్త్వలంకృతైః
రత్నకూటైర్గృహైర్హైమై ర్మహామరకతస్థలైః ॥

శ్లో॥ వాస్తోష్పతీనాం చ గృహై ర్వలభీ శ్చ వినిర్మితం
చాతుర్వర్ణ్యం జనాకీర్ణం యదు దేవగృహోల్లసత్ ॥ ౧౩

తా॥ విశ్వకర్మ సంతోషించినవాడై యా సమయముననే యొక నిమిషములో శత్రురాజుల కసాధ్యమై యొప్పున టంబుధిమధ్య నొక పట్టణమును రచించి దానికి ద్వారక యని పేరిడెను. అది విశ్వకర్మ నిర్మితమగుటచే శిల్ప విజ్ఞాన నైపుణ్యము మిక్కిలి చూడఁదగియుండెను. రాజవీధులు తీర్చి ముంగిళ్ళచే నలంకరింపఁబడి వాస్తుశాస్త్రోక్తముగా నిర్మింపబడిన గృహములును, కల్పలతల తోడ నుద్యానములను, విచిత్రములగు నుపవనములను, కలిగి శోభిల్లుచుండెను చలువరాలతో రచితములైన కోటబురుజులు. గోపురములు, బంగారు శిఖరములతో నాకాశము మెరయుచుండెను. వెండిచేత, విత్తడిచేతఁ గూడ నిర్మింపఁబడియున్న యన్నశాలలు, అశ్వశాలలు మొదలగునవి సువర్ణకలశములతోఁ బ్రకాశించుచుండెను. నగర గృహ ద్వార సమీపమున దేవతా గృహములచేతను, పద్మరాగాదిమణుల చేతను, మహా మరకతములతో నొప్పు గృహములచేతను, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు లాలయు శ్రీకృష్ణమందిరములచేతను, వెలయుచుండెను.

శ్లో॥ ఏవం నానావిధాన్ చిత్రాన్ దృష్ట్వా యదుకులోత్తరః
విస్మయోఽభూత్తతస్త స్యాంద్వారకాయాం ప్రవేశవాన్.

తా॥ ఇట్టి మహోత్తరములైన నానావిధ చిత్రములను జూచి శ్రీకృష్ణుఁడు తన మనస్సున నాశ్చర్యము జెందినవాఁడై యా ద్వారకానగరమునఁ బ్రవేశించెను.

శ్లో॥ దివ్యాలం కారవాసోభి ర్దివ్యస్రగనులేపనైః
ద్వారకావాసినో భాంతి విశ్వకర్మ ప్రసాదతః ॥ ౧౪

శ్లో॥ నిధయో నవపద్మాద్యాః సిద్ధయోఽష్టాణిమాదయః
దాసదాస్యశ్చ సర్వేషాం ప్రత్యేకం ద్వారకౌకసాం ॥

శ్లో॥ తస్మాద్వై విశ్వకర్మాణం పూజయంతి విచక్షణాః
తేహి కాంక్షంతి కల్యాణం గృహిణాం జీవనార్థినః ॥ ౧౬



తా॥ ఆ విశ్వకర్మ భగవానుని యొక్క యనుగ్రహము వలన ద్వారకాపురము నందలి జనులెల్లరు వేఱువేఱుగా సుందరములై యలంకరింపబడిన గృహముల చేతను, నవనిధులచేతను అణిమాద్యష్టసిద్ధులచేతను, మందారాది దివ్యలోక పుష్ప మాలికల చేతను, దివ్యగంధములచేతను, దాసదాసీజనములచేతను ప్రకాశించుచుండిరి. అందువలననే పెద్దలైనవారు విశ్వకర్మను పూజించుచున్నారు. గృహస్థులలో నెవరు శుభములను, ఆయుష్యమును అపేక్షించుచున్నారో వారును విశ్వకర్మనే పూజించు చున్నారు.

శ్లో॥ మహాసాగర మధ్యస్థాం దుర్భేద్యాం ద్వారకాపురీం
జలయాన వ్యోమయాన భూయాన రథపూరితాం ॥ ౧౮

శ్లో॥ నానామాతంగ గంధర్వ పదాత్యాది బలాన్వితాం
యోజన ద్వాదశ మితం చతురస్రాం భయావహాం ॥

శ్లో॥ శస్త్రశాస్త్రైస్సమాయుక్తాం దృష్ట్వా సర్వేఽపి శాత్రవాః
జయోపాయం నజానంతి సమాలోచ్య దివానిశమ్ ॥ ౨౦

తా॥ గొప్పదయిన సముద్రమునకు నడుమ నున్నదియును, భేదింపనలవి కానిదియును. నీటిపైనను, ఆకాశముననను, భూమిపైనను, నడచునట్టి రథములచే నిండినదియును, అనేకములయిన యేనుఁగులును, గుఱ్ఱములును, సేనయును గలిగి యొప్పుచున్నదియును పదిరెండు యోజనముల నిడివిగలిగి యడియే వెడల్పున చౌకముగా నున్నదియును, ఆయుధాగారములు కలదియును, మహాభయము గలిగించు నదియును, అగు ద్వారకాపురిని జూచి కృష్ణుని శత్రువులెల్లరు నాపురంబును గెలువ రేయింబవళ్ళాలోచించి విఫల మనోరథులైరి.

శ్లో॥ యే యే కుర్వంతి విశ్వస్య వ్రతత్వం వాంఛిత సిద్ధిదం
తేతే సర్వే వాంఛి తార్థాన్ లభం తేస్మ తదా తదా ॥

తా॥ ఆ పట్టణమునం దెవరెవ రీవ్రతమును చేసియుండిరో వారు వారంద ఱును దమ కోరికల నప్పుడే పొందుచుండిరి

శ్లో॥ పంచభిస్సహితః పుత్రై ర్విశ్వకర్మా మహర్షయః
ద్వారకావాసిభి ర్నిత్యం శ్రీకామైః పూజ్యతే సదా ॥

తా॥ ఓ మహర్షులారా! విశ్వకర్మ తన యేవురు సుతులతో సహా ద్వారకా పుర జనులందరిచే నిరంతరము ను పూజింపబడుచున్నాడు.

శ్లో॥ దరిద్రో లభతే విత్తం బద్ధో ముచ్యేత బంధనాత్
భీతో భయాత్ప్రముచ్యేత సత్యమేవ నసంశయః ॥

శ్లో॥ కథాం వా శ్రుణుయా ద్యస్తు పఠేద్వా వ్రత ముత్తమం
తస్య నశ్యంతి పాపాని విశ్వకర్మ ప్రసాదతః ॥

తా॥ శ్రేష్ఠమయిన శ్రీ విశ్వకర్మయొక్క కథను పఠించినను, వినినను విశ్వకర్మ యొక్క దయవలన నాతడు పాపరహితుడై పుణ్యవంతుడగుచున్నాడు. దరిద్రుడీ కథను వినిన ధనవంతుడగును. బంధనాలయమున నున్నవాడు బంధనము నుండి విడువబడును. భయమును బొందియున్నవాడిది వినినచో భయరహితుడగును. ఇందు సంశయము లేదు.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం సప్తమోఽధ్యాయః ॥

## అథాష్టమోఽధ్యాయః

శ్లో॥ సమాహితేన మనసా శ్రుణుధ్వం మునిసత్తమాః
సచ్చిదానంద రూపస్య దివ్యాఖ్యానం జగద్గురోః ॥

తా॥ ఓ మనిశ్రేష్ఠులారా! సచ్చిదానంద స్వరూపుడును, జగద్గురుండును అగు శ్రీ విశ్వకర్మ భగవానునియొక్క శ్రేష్ఠమయిన కథను జెప్పుచున్నాను. శ్రద్ధగో వినుడు.

శ్లో॥ ఆసీత్ప్రమంగదో రాజా ప్రజామివ ప్రజామసౌ
రక్షయా మాస ధర్మాత్మా సర్వకర్మ స్వతంత్రితః ॥



తా॥ పూర్వము ప్రమంగదుడను రాజొకడుండెను. అతడు ప్రజలను తన బిడ్డలవలె పాలించెను. మరియు ధర్మవిష్టుడును సమస్తకార్యము లను నిశ్చల చిత్తముతో జేయువాడును అయియుండెను.

శ్లో॥ భార్యా కమలపత్రాక్షీ సతీ సాక్షాత్సతీవసౌ
విదుషీ కమలానామ్నీ ధర్మకర్మ వ్రతోద్యతా ॥

తా॥ ఆ రాజునకు పద్మములవంటి కన్నులు గలదియు, పార్వతివలె పతివ్రతా శిరోమణియు, జ్ఞానవతియు, ధర్మకర్మ వ్రతాసక్తయు నగు కమల యను పేరుగల భార్యయుండెను.

శ్లో॥ కదాచి ద్దైవయోగేన నరేంద్రస్య కలేబరే
ప్రాదుర్బభూవ కుష్ఠాఖ్యో రోగః పరమదారుణః ॥

తా॥ ఒకప్పుడు ప్రారబ్ధవశమున నారాజునకు కుష్ఠవ్యాధి యుత్పన్నమయ్యెను.

శ్లో॥ చికిత్సమానో ప్యనిశం స్వల్పోఽపి నశశామసః
రోగపీడా పరీతాత్మా నృపో వ్యాకులతాం గతః ॥

తా॥ ఆరోగ్యమునకు దగిన యౌషధములను గొప్ప గొప్ప వైద్యులనేక విధములుగా నిత్య ముపయోగించుచుండినను కొంచెమయినను నుపశమించియుండలేదు అందువలన నతడు మిక్కిలి వ్యాకులచిత్తుడై యుండెను.

శ్లో॥ కదాచి ద్దుఃఖినం ప్రేక్ష్య రాజానం తంపతివ్రతా
భార్యా జ్ఞాత్వా తద్దుఃఖార్తాన్ ప్రావోచత్తు తపస్వినీ ॥

తా॥ ఇట్లు వ్యాధిచే దుఃఖము నొందుచున్న భర్తనుజూచి మహాపతివ్రతయగు నతని పట్టపుదేవి యిట్లు పలికెను.

శ్లో॥ ఉపమన్యు ర్మహాతేజా అస్మాకం తు పురోహితః
చక్షు ష్యువహితో కాండే నితాంతం ఛాందతాంగతాం ॥

తా॥ ఓ రాజా! మహాజ్ఞానియు, సుమన్యు నామధేయుఁడు నగు మన పురోహితుఁడొకప్పుడు నేత్రవ్యాధితో బీడింపబడుచు నెడతెగని యంధత్వమున శ్రమనొందుచున్న నన్ను జూచెను.

శ్లో॥ తేన జ్ఞానప్రభావేణ జ్ఞాతా తస్య ప్రతిక్రియా
మాసిమాసి త్వమావస్యాం పూజనం విశ్వకర్మణః ॥ ౮

తా॥ మహాజ్ఞానియగు నా పురోహితుఁడు తన యొక్క జ్ఞాన దృష్టిచే నా జాడ్యము నెఱింగి నాకు శమనోపాయమును జెప్పెను. ప్రత్యేక స్థలమున ప్రతి యమావాస్యయందు శ్రీ విశ్వకర్మ పూజాధికముగా వ్రతమాచరింపగా నానేత్ర వ్యాధి నివారించినది. అది మొదలు నేనత్యానందము నొందుచున్నాను

శ్లో॥ సర్వకార్యాణి సంత్యజ్య వ్రతం కృత్వా విధానతః
బ్రహ్మచారీ ఫలాహారీ ధర్మతత్వ రతోభవేత్ ॥ ౯

తా॥ ఆ పురోహితుడమావాస్య దినమున తన యితర కర్మముల నన్నిటిని వదలి బ్రహ్మచర్య నిష్ఠతో విధిపూర్వకముగా విశ్వకర్మ పూజావ్రతము నొనరించును.

శ్లో॥ తద్వ్రతస్య ప్రభావేన దివ్యదృష్టి ర్బభూవసః
ఇదానీ మపి వార్ధక్యే తస్య దృష్టి ర్నలీయతే॥ ౧౦

తా॥ అతఁడా వ్రతముయొక్క ప్రభావముచే దివ్యదృష్టిగల వాఁడయ్యెను మిగుల ముదిమి నందియు గొంచెమయినను దృష్టిలోపము లేకుండెను.

శ్లో॥ దీనాహం ప్రార్థయే రాజన్ తస్మాత్త్వస్య భవానసి
ప్రయాతుం దీననాథస్య శరణం విశ్వకర్మణః ॥

తా॥ ఓ మహారాజా! దీనురాలనగు నా ప్రార్థనము నంగీకరించి దీన రక్షకుఁడగు భగవాన్ విశ్వకర్మను శరణము వేఁడుము. ఆయనయొక్క కృపచే నీవు వ్యాధినుండి విముక్తుడ వగుదువు.

శ్లో॥ ప్రియే సాధుతరం ప్రోక్తం నిశమ్యోచ్చ్వ సతీవమే
చేతోయతో ధ్రువాసిద్ధిం చిత్తోత్సాహో ప్రతీతి మాం ॥

తా॥ ఓ! ప్రియురాలా! నీవు చెప్పినది సమంజసముగనే యున్నది. వినినంతనే నాకు సంతోష మొదవినది. విశ్వకర్మయొక్క పూజను వ్రతమును



ఆచరించి తన్మాహాత్మ్యమువలన నీ రోగమునుండి నిశ్చయముగా విముక్తినందగలను. దీని నెప్పుడు తలపెట్టుదునా యని మనమున నుల్లాసము కలిగినది.

శ్లో॥ ఆరభ్య తద్దినాద్రాజా ప్రత్యహం విశ్వకర్మణః
పూజనం వందనం కృత్వా భోజనం చ చకారహ॥

తా॥ అది మొదలుకొని యా రాజు ప్రతి దినమును విశ్వకర్మను పూజించి నమస్కరించి భోజనము చేయుచుండెను.

శ్లో॥ అమావాస్యావ్రతం కృత్వా నియతో ధ్యానతత్పరః
రాజకార్యాణ్యపి త్యక్త్వా విశ్వకర్మాణ మర్చతి॥ ౧౪

తా॥ అమావాస్య దినమున సమస్త రాజ్య కార్యములను వదలి బ్రహ్మచర్య నియమముతో నేకాగ్రచిత్తము గలిగి విశ్వకర్మను ధ్యానించి పూజించి వ్రతము నాచరించుచుండెను.

శ్లో॥ విశ్వకర్మ ప్రభావేణ కుష్ఠనాశోఽభవత్ క్షణాత్
సువర్ణప్రతిమా భూత్వా రాజభోగా నవాపసః॥

తా॥ విశ్వకర్మ భగవానుని పూజావ్రత ప్రభావముచేత ఆ రాజునకొక క్షణ కాలములోనే కుష్ఠువ్యాధి రహితమయ్యెను. అతని శరీరకాంతి మేలిమిబంగారువలె ప్రకాశించుచుండెను. తదుపరి సమస్త రాజభోగముల ననుభవించెను.

శ్లో॥ తదాప్రభృతి తందేవం విశ్వకర్మాణ మీశ్వరం
నవిస్మమార భూపాలః తత్పదాం భోజషట్పదః॥ ౧౬

తా॥ అది మొదలా రాజు ప్రతి యమావాస్యయందు విశ్వకర్మ వ్రతమును తన యావజ్జీవితకాలము నిశ్చల చిత్తముతో జేయుచు కేవలము విశ్వకర్మ చరణ పద్మముల వీడని భృంగరాజమయ్యెను.

శ్లో॥ యోనరో విశ్వకర్మాణం ధ్యాయతే భక్తితత్పరః
తస్య రోగనివృత్తిస్స్యా దంతే మోక్ష మవాప్నుయాత్ ॥

తా॥ ప్రతి దినమనను శ్రీవిశ్వకర్మ భగవానుని స్థిరచిత్తముతో నెవడు ధ్యానించుచున్నాడో అతడు సమస్త రోగములనుండి విముక్తుఁడగుచు నంతమున మోక్షమును బొందుచున్నాఁడు.

ఇతి శ్రీ విశ్వకర్మసంహితాయాం సృష్టిఖండే
విశ్వకర్మకథాయాం అష్టమోఽధ్యాయః॥

## అథ నవమోఽధ్యాయః

శ్లో॥ శ్రుణుధ్వం మునయస్సర్వే భూయస్తే కథయామ్యహం
సర్వలోకేమ విఖ్యాతం మాహాత్మ్యం విశ్వకర్మణః॥ ౧

తా॥ ఓ ఋషులారా! సమస్త లోకములయందు ప్రసిద్ధి గాంచిన శ్రీ విశ్వకర్మయొక్క మహత్మ్యమును గూర్చి మీకు మరల నొక కథ చెప్పు చున్నాను వినుఁడు.

శ్లో॥ వారణాసీ పురే కౌచిత్ వైశ్వ కర్మణదంపతీ
ప్రవసతః స్మసంతుష్టౌ జగద్యాత్రా సయాత్రకౌ॥

తా॥ కాశీక్షేత్రమున నొక విశ్వకర్మ బ్రాహ్మణవంశీయు డుండెను, ఆయనకు సుగుణవతి యగు భార్యకలదు. ఆ దంపతులు స్వధర్మము నాచరించుచు చరితార్థమయిన సంతోష వృత్తితో మెలగుచుండిరి.

శ్లో॥ ప్రత్యహం బ్రహ్మవంశ్యోఽసౌ స్వకర్మ కుశలస్సుధీః
పర్యాప్తాం వృత్తిమన్వేష్టుం యతతేస్మ మహాకులః॥

తా॥ ఆ బ్రాహ్మణుడు మిక్కిలి బుద్ధిమంతుఁడును, స్వకర్మ నిపుణుడును, అయినను సంతృప్తికరమగు జీవనోపాయము లేక యెల్లప్పుడు మహావ్యాకులచిత్తుఁడై యుండెను.



శ్లో॥ ఏవం ప్రయతమానోఽపి పరిభ్రామ్యన్ సృగాలవత్
భోజనాచ్ఛాదనాభ్యాంతు నాలభత్యధికం క్వచిత్॥ ౪

తా॥ ఇట్లు ప్రయత్న మొనర్చుచు నెన్నియో ప్రదేశములకు దిరిగి తిరిగి యన్నవస్త్రములకు మాత్రమే సంపాదింపగలిగెను. కాని యంతకంటె నెక్కువను బొంది యుండలేదు.

శ్లో॥ పుత్రాభావాత్తదీయాచ భార్యానిత్యం శుశోచహ
స్థవిరాయా మవస్థాయాం కథం వృత్తి ర్భవిష్యతి॥

తా॥ ఆ బ్రాహ్మణశ్రేష్ఠునికి సంతతి లేనందున నతనిభార్య యెల్లప్పుడును మేము వార్ధకావస్థయం దెట్లు జీవింప గలుగుదుమో యనిమిగుల దుఃఖించుచుండెను.

శ్లో॥ ఏవం శోచ్య దశాపన్నౌ తౌదుఃఖార్తౌ హి దంపతీ
కశ్చిత్సమీక్ష్య వ్యాచష్ట ప్రతివేశీ ద్విజోత్తమః॥

తా॥ ఈ తీరున విచారగ్రస్తులై యున్న యా దంపతులను గాంచిన యొక పొరుగింటి బ్రాహ్మణుఁ డిట్లు చెప్పెను.

శ్లో॥ శిల్పిరాజ కథంకర్తుం భ్రామ్యసి తస్తతోభృశం
సర్వథా బాలిశస్త్వంమే మనీషాయాం ప్రతియసే॥ ౭

తా॥ ఓ ఆచార్యుఁడా! ఇంతకంటె నెక్కడ నేమి చేయుట కిట్టి ముగా తిరుగుచున్నావు. అన్ని విధముల నీవు బొత్తిగా దెలియనివాడ వని ... దలంచుచున్నాను.

శ్లో॥ అతస్సర్వా వృథాకారా నుపాయాన్ త్వంపరిత్యజ
కేవలం శరణం గచ్ఛ దయాళో విశ్వకర్మణః॥

తా॥ కనుక నీవువ్యర్థములైన యుపాయ ములన్నింటినివదలి దయామయుండగు విశ్వకర్మను తప్పక శరణు వేఁడుము.

శ్లో॥ తస్యా నుకంపయా సాధో సిద్ధి స్సంపత్స్యతే తవ
దుఃఖోచ్ఛేద ప్రభుఃకోఽపి నవినా విశ్వకర్మణః॥

తా॥ ఓ శ్రేష్టుఁడా! విశ్వకర్మ ప్రభునియొక్క దయవలన సీకిష్ట సిద్ధి యగును. సమస్త దుఃఖముల నశింపజేయుటకు విశ్వకర్మ భగవానుఁడు కాక సమర్థుఁడింకొకవేఁడు లేడు.

శ్లో॥ అతోఽమాయాం స్వకార్యాణి సంరుద్ధ్యవిజితేంద్రియః
ఉపోష్య శృణుయాద్భక్త్యా విశ్వకర్మ కథాంశుభాం॥

తా॥ కనుక నీవు సమస్త కర్మములను వదలి యమావాస్యదినమున జితేంద్రియుఁడవై యుపవాస మొనర్చి భక్తితో విశ్వకర్మ వ్రతము నాచరించి కథను వినుము.

శ్లో॥ ఇత్యాకర్ణ్యవచ స్తస్య బ్రాహ్మణస్య మహాత్మనః
ఉన్మిమీల తదా తస్య విశ్వబ్రాహ్మణ లోచనం॥ ౧౧

తా॥ మహాత్ముఁడగు నా బ్రాహ్మణు డిట్లు చెప్పగా విని యా శిల్పాచార్యుడు జ్ఞానముకలవాఁ డయ్యెను. అప్పుడే విశ్వకర్మ తన హృదయమున ప్రకాశించెను.

శ్లో॥ తదారభ్యు తు ధర్మాత్మా బ్రహ్మవంశ్యోఽభవ త్సదా
శ్రీ విశ్వకర్మ పాదేషు భక్తి సంసక్త మానసః॥

తా॥ అది మొదలా విశ్వబ్రాహ్మణుఁ డెల్లప్పుడు స్వధర్మ తత్పరుఁడును విశ్వకర్మ పదకమల సేవాపరతంత్రుఁడును, అయి యుండెను.

శ్లో॥ తస్యభార్యా సుసాధ్వీచ మిథ్యోపాయాఽ విహాయసా
విశ్వకర్మ గుణేష్వద్ధా రక్తాజాతా మనస్వినీ॥ ౧౩

తా॥ పతివ్రతయగు నతని భార్యయు మాయోపాయములను విడిచి విశ్వకర్మ యొక్క గుణములయం దాసక్తితో మిగుల భక్తితో బూజించుచుండెను

శ్లో॥ అమావస్యాం వ్రతం దివ్యం చక్రాతే విశ్వకర్మణః॥
తస్యోపవాసతోఽభూతాం ధనపుత్రాన్వితౌద్రుతం॥

తా॥ ఆ దంపతు లమావాస్యయం దుపవసించి వ్రతాచరణయుక్తులై విశ్వకర్మను పూజించి, కథాశ్రవణ మొనర్చిరి. ఆ వ్రతప్రభావమువలన వెంటనే ధనమును పుత్రులను గలవారైరి.



శ్లో॥ కదాచిదపి నైకోఽపి ఘస్రోయాతో వృథాతతః
అసాంచక్రే ప్రతిదినం వృత్తి కర్మపరాయణః ॥ ౧౪

తా॥ ఆ బ్రాహ్మణోత్తముఁడు నిత్యము చరితార్థమైన ప్రవర్తనము కలవాఁడై యుండెను. వృత్తి కర్మమునందలి నిపుణుఁడై వ్యర్థకాలములేని స్థితిలో నుండెను.

శ్లో॥ తయో స్సుశీలా గుణినః సంధ్యావందనతత్పరాః
విద్వాంస స్సమభూత్పుత్రాః శుశ్రూషణపర స్సుతాః ॥

తా॥ ఆ దంపతులకు మంచి ప్రవర్తనము కలవారును, నిత్యకర్మతత్పరులును గుణవంతులును, విద్వాంసులును, మాతాపితృసేవాసక్తులును. అగు కుమారుల జన్మించిరి.

శ్లో॥ ఇత్థం సుఖయుతౌ జాతౌ వైశ్వకర్మణ దంపతీ
విశ్వకర్మ ప్రభావేణ సర్వ దేవాతిశాయినా ॥ ౧౬

తా॥ ఈ ప్రకార మా దంపతులు సర్వదేవతలలో శ్రేష్ఠుఁడగు విశ్వకర్మ యొక్క వ్రత ప్రభావమున సమస్త సౌఖ్యముల ననుభవించిరి

శ్లో॥ యః పఠే ద్విశ్వకర్మాణం భక్తియుక్తేన చేతసా
సేహలోకే సుఖీ నిత్యం జాయతే పుత్రపౌత్రకైః ॥ ౧౭

తా॥ ఏ మానవుఁడి ప్రకారముగా భక్తియుతమగు నంతఃకరణముతో విశ్వకర్మ పూజనమునుచేసి కథనువినుచున్నాడో అతఁ డీలోకమున పుత్రపౌత్రాదులతోడను, మహదైశ్వర్యముతోను. ఎడతెగని సుఖము ననుభవించుచున్నాడు.

ఇతి శ్రీవిశ్వకర్మ సంహితాయాం సృష్టిఖండే
శ్రీ విశ్వకర్మ కథాయాం నవమోఽధ్యాయః ॥

స్వస్తిః ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయేనమార్గేణ మహీం మహీశాః జీవాదికేభ్యః శుభమస్తు నిత్యం లోకాః సమస్తాః సుఖినోభవంతు.

ఓం తత్సత్ బ్రహ్మార్పణమస్తు.